

ది. 7-5-84 తేదీన శ్రీ తంగిరాల సుబ్రహ్మణ్యశాస్త్రి, కార్యవాహి కార్యదర్శి,
ద. భా. హిందీప్రచారసభ ఆంధ్ర తెనాలి హిందీ ప్రచారక విద్యాలయం
సత్రాంత సమారోహ్‌లో ఉపన్యసించుచున్నారు.




సాహిత్య మాస పత్రిక

**362**

జూన్ 1984

సంపుటి : 31, సంచిక 3

వార్షిక చందా : పదిహేను రూపాయిలు

విడిప్రతి : రూపాయిన్నర

సంపాదకులు:

**వేమూరి రాధాకృష్ణమూర్తి**

# ఈ సంచికలో


| | |
|---|---|
| 1. సంపాదకీయం | |
| 2. రసశేవధి (కవిత) | చల్లా నరసింహారావు |
| 3. గ్రీష్మము (కవిత) | కె. వాసంతి |
| 4. స్మృతిసూక్తము (కవిత) | బుద్ధన్న |
| 5. కాకి-నక్క (కవిత) | పి. వెంకటరామశాస్త్రి |
| 6. శూన్యవేళ (కవిత) | ధర్మవరపు బుచ్చిబాపరాజు |
| 7. భయం (కవిత) | ,, ,, ,, |
| 8. అబ్సర్డ్ నాటకాలు | వేమూరి ఆంజనేయశర్మ |
| 9. సానుభూతి | బుర్రా రత్నరాజు |
| 10. మనస్తత్వ చిత్రీకరణ | అన్వేషి |
| 11. శత్రువు (కథానిక) | మూలం : హీరానంద్ సచ్చిదానంద్ వాత్స్యాయన్ "అజ్ఞేయ" అనువాదం డా॥ మాధవరావు రేగులపాటి |
| 12. రఘునాధ విలాసం-రస పరిశీలనం | శ్రీమతి మన్నేరు వసుంధర |
| 13. ఆధునిక ధశావతారములు | "సహజకవి" |
| 14. కవి-ఋషి | విశ్వ |
| 15. మనిషి-మధురత | కొండిపర్తి శేషగిరిరావు |
| 16. నవసమాజము-సాహిత్య దృక్పథము | ఏ. నాగేశ్వరరావు |
| 17. త్రిభాషా సూత్రం | వేమూరి ఆంజనేయ శర్మ |
| 18. సాహిత్యగోష్ఠి | డా॥ ఆచార్య భావన్ |
| 19. సమీక్ష | శీలం రాజే |
| 20. వార్తావాహిని | తంగిరాల |

సంపాదకీయం

# రాజభాష

మహాత్మాగాంధీగారిచే స్థాపింపబడిన దక్షిణభారత హిందీప్రచార సభ గత ౭౫ ఏండ్లనుండి దక్షిణభారతదేశంలో అవిచ్ఛిన్నంగా హిందీ ప్రచారం చేస్తూవస్తున్నది. శ్రీహరిహరశర్మగారు, శ్రీమోటూరువారు, శ్రీ పీసపాటివారు శ్రీ ఉన్నవవారు, శ్రీ వేమూరివారు జాతీయభాష అయిన హిందీని గ్రామ గ్రామాన ప్రచారం చేశారు. హిందీలో నాటకాలు వేశారు, ఉపన్యాసాలు చేశారు. మహాసభలు జరిపించారు, హిందీప్రేమీమండలులు స్థాపించారు. హిందీ ప్రశిక్షణ తరగతులు నిర్వహించి వేలకొలది హిందీప్రచారకులను తయారు చేశారు, తత్ఫలితముగ దక్షిణ భారతంలో జాతీయ భాషఅయిన హిందీకి సముచిత స్థానం లభించింది.

భారత రాజ్యాంగంలో హిందీని జాతీయభాషగ నిర్ణయించటానికి దక్షిణాది నాలుగు ప్రాంతాలలో హిందీ ప్రచారసభ చేసిన హిందీ ప్రచారం చాలా దోహదం చేసింది. చరిత్రలో దక్షిణభారత హిందీప్రచారసభ చేసినకృషి సువర్ణాక్షరాలతో లిఖించదగియున్నది.

మహాత్మాగాంధీగారి నాయకత్వంలో ఎంతోమంది దేశభక్తుల త్యాగాల ఫలితంగా భారతదేశానికి స్వాతంత్ర్యము లభించింది. స్వతంత్రభారతదేశంలో కేంద్రంలో హిందీ రాష్ట్రభాషగాను, రాజభాషగాను ప్రాంతాలలో ప్రాంతీయ భాషలు రాజ్యభాషలుగాను చలామణి కావలసియున్నది. కాని అది జరగడం లేదు.

జాతీయభాషగా హిందీ ఒక పరిధి వరకు వ్యాపించింది. కాని రాజభాషగా హిందీ తగినంతగా ముందుకు అడుగువేయలేక పోయింది. ప్రైవేటు పబ్లిక్ సంస్థలలో హిందీకొనసాగనినాడు ఇంగ్లీషుకు పట్టం కట్టటమే అవుతుంది. ఇంగ్లీషు స్థానంలో రాజభాషగ హిందీభాషను వ్యాప్తిచేయుటకు అవిరళ కృషి జరగవలసి వున్నది.

దక్షిణభారత హిందీ ప్రచారసభవారు హిందీని జాతీయభాషగ ప్రచారం చేసి కొంతవరకు సఫలీకృతులయినారు. అట్లే హిందీని రాజభాషగాకూడ ప్రచారంచేసి దేశఐక్యతకు, వికాసమునకు తోడ్పడవలసి యున్నది. హిందీ

రాజభాషగా రాష్ట్రభాషగా వ్యాప్తిచెందిననాడే హిందీయొక్క సమగ్రరూపం బలపడి ఇంగ్లీషు స్థానాన్ని పూర్తిచేయగలుగుతుంది. అందులకు ఈక్రింది సూచనలు తోడ్పడగలవని మా అభిప్రాయం

1) దక్షిణ భారత హిందీ ప్రచార సభవారు
ప్రచారక ట్రైనింగ్ నడుపుచున్నట్లుగ, ప్రవీణలో ఉత్తీర్ణులైనవారికి రాజభాషగ హిందీ కార్యాలయాలలో పనికి వచ్చేటట్లుగ ఒక పాఠ్య ప్రణాళిక తయారుచేసి బోధించాలి.

2) సభవారి ప్రవేశికపరీక్షలో ఒకపేపరు రాజభాషకు కేటాయించి క్రమేపీ ప్రవీణవరకు ఈ కోర్సును పెంపొందించాలి.

3) సభవారి విశారద ప్యాసయి 10th ప్యాసు అయినవారికి ప్రత్యేకమయిన పరీక్ష నడపాలి.

4) రాజభాష హిందీకొరకై ఒక ఉప సంఘాన్ని నియమించి ఒక నివేదిక తయారు చేయించాలి. దానిప్రకారం రాజభాషా ప్రచారం సాగించాలి.

ఏది ఏమయినా హిందీని రాజభాషగ అవసరమయిన ప్రతిచోట ప్రవేశ పెట్టటానికే తక్షణం సమస్తచర్యలు తీసికోవలసిన నైతిక బాధ్యత సభమీదే వున్నది. అప్పుడుగాని మహాత్మాగాంధీగారి కలలు సార్థకం కావు.

దక్షిణభారత హిందీ ప్రచారసభ ప్రాంతీయ భాషల అభివృద్ధికి కంకణం కట్టుకున్న సంస్థ. దక్షిణాది లోని నాలుగు ప్రాంతాలలో గూడ అయా భాషల సమగ్రవికాసములకు ఆయా ప్రాంతాలలో అధికారభాషగ అయా ప్రాంతీయ భాషలు అమలుకావడానికి తగిన కృషి చేయవలసివున్నది.

ఆంధ్రప్రదేశ్ అధికారభాషగ తెలుగును ఉపయోగించుటకు ప్రత్యేకమైన చట్టాన్ని నిర్మించి అధికారభాషా కమీషన్‌ను నియమించింది. అయినా పనిబాగా సాగుతున్నట్లు కనిపించడంలేదు. మన ప్రక్కనున్న తమిళ, కర్ణాటక ప్రాంతాలలో ఆయాప్రాంతీయ భాషలలోనే పాలనా యంత్రాంగం నడుపుటకు జరుగుతున్న కృషితోపోలిస్తే మనం ముందుకుసాగినట్లు కనబడడం లేదు.

ఆంధ్రలో తెలుగును వ్యాప్తిలోకి తెచ్చే విషయంలో కూడ దక్షిణభారత హిందీప్రచారసభ కొంత బాధ్యత వహించి తగిన కార్యక్రమం చేపట్టాలి.

ప్రాంతాలలో ప్రాదేశిక భాషలూ, కేంద్రంలో హిందీ అధికార భాషలుగా పెంపొందడం సభ లక్ష్యంగనుక అందుకు ముందంజ వేయడం అవసరంగా కన్పిస్తున్నది.

# రసశేవధి

చల్లా నరసింహారావు

నేలయు గాలి నిప్పు మరి నీరును, సృష్టిని నాల్గు భూత సం
జాతము; జీవితమ్ములకు సాయము సేయుచు నుండు నవ్వి యే
వేళను; నింగి వాని జత వేరయి లెక్కకు నంద; దెందుకా!
నీలపు శూన్యమద్ది; కన నేరము దాకిన దాని నిత్యమున్.

రాజుల కామకేళి ననురక్తి కనంబడ దింత కూడ నే
రోజును; రాజ్యపాలన విరోధులు చిత్తముఁ జేరి; వారిదౌ
తేజము గాజు చిమ్మగల దీపము లోనిది! కోటయేల? యా
రోజులు నేల?; యొల్లనది; రూపసితో సుఖయింతు బాకలో.

బ్రతుకెపు డాఁకలిన్ నిలిపి బాధను బెట్టకు; మంతకన్న జి
త్తతమము వేరెలేదు; దరిదాపునకైనను జేరనీకు మ
ద్వైత శ్రుతిమార్గ మెప్పుడును బేదకు శత్రువు; దానినమ్మ బో
కు; తినుము; క్రిందు మీఁదుఁబడి గూర్చిన సొమ్మున సంతసమ్మునన్

దొరకిన యంతనే ఋణము తొందర పోవుచుఁ దీసి కొమ్ము యెం
దఱికడ నైనఁగాని; యిఁక దానిన;? కోడి పులావు కోసమున్
సురకును ఖర్చుపెట్టు; వెనుచూడకు; సొమ్మును దీర్చుటందువా?
మఱి తరువాత దానిపని; మ్రాన్పడ బోకుము జీవితమ్మునన్

మనముల కింపు గూర్చు సుషమా సుఖ వాసన నింపుకొన్న క్రొ
న్ననలు వికాసమొందుచు వనమ్మున రంగుల సొంపు వంపె. జ
వ్వని! కనుగొమ్ము; సృష్టియె విభావరి వెన్నెల చీరపైనన
ద్దినవవి ; నాదుపద్యమటు తీయగ రమ్మిఁకఁదెమ్ము కుల్కులన్

(చార్వాక సిద్ధాంతమున కనుకరణముగా కవి రచించిన
'రసశేవధి' అముద్రితకావ్యమునుండి)

# గ్రీష్మము

—కొడివెన వాసంతి

సూర్యకరముల కబ్బెను సుదతి చూపు
నదుల కమరెను ఆయమ నడుము సొబగు
బొండుమల్లియ కడ ఇంతి వెండి నవ్వు
దివస సమయమ్ము సుందరి దీర్ఘవేణి.

వచ్చె వెచ్చగ గ్రీష్మము; పచ్చ నాచు
హెచ్చె మొగ్గలు మల్లెల; చిచ్చురేగె
వ్రచ్చె పుడమికి హృదయము విచ్చుకంట
పచ్చి విలుకాడు కాలిన ఫక్కిదోచె

భూమి వెలసిన రిక్కల భామలటుల
క్రొత్తమల్లెలు పూచెను గుత్తులగుచు
పెండ్లికూతుల నల్లని వేణియందు
నింగి తారల తీరున నిండి వెలిగె

పండి యొరిగిన కమ్మని పండ్లతోడ
తనరె మామిడి తరులెల్ల తరుణులటుల
చిన్నిపాపని చేనెత్తు చేడె పగిది
లలిత సుందరియా వనలక్ష్మి రీతి.

దాగబోయెను గంగమ్మ ధరణివిడచి
దాగిపోయెను నరులపై దయను మరచి
దాగె నెచటనో పాతాళ ధామమందు
దాగ దక్కట! ఎటనైన దప్పికయును.

కాంతలందరు నీటికై కలసి పోయి
కలశముల నొక్కసారిగా కలిపి విడువ
రాను రానని గాజుల రవళి తోడ
గంగ పలికిన పలుకుల గతులు తోచె

ఎండవేడిమి ఒక వంక మండిపడగ
వాయుదేవుని కరుణయు మాయమవగ
బిట్టు విసిగియు ధరియించు పట్టుచీర!
వనిత నుతియింప నలవియే? వనజభవుడ!

ఆట విడుది పిల్లల ఆటలకును
పెండ్లి విందుల సందడి ఇండ్లమెరయు
గ్రీష్మ తాపమ్ము దినమంత కృష్ణజపము
ఆమ్ర ఫలముల వారాశి క్రమమూర్తి.

మల్లె.మాలతి పూవుల మధువు లొలుక
నారికేళపు శైత్యము నవ్విపిలువ
రాత్రులంతట పవనుడురాగ,కలిగె
జనుల మనమందు చలినాటి జాము భ్రాంతి

తాను వచ్చును వాసంత తరుణితోడ
చెలిమి తనవెంట నడయాడు చెలియ-వ
ముందు వెనుకల నిటువంటి వెందలున్న
ఎండకారుకు సరిజోడి ఎందుకలదు?

ఉస్మానియా యూనివర్సిటీ,
హైదరాబాదు-7

# స్మృతిసూక్తము

— బుద్ధన్న

మమత లెన్ని యెన్ని మగువకోసము పొంగి
క్రుంగిపోని హృదయ కోశమేది?
ఆశలెన్ని యెన్ని మోసమై మగవాని
బ్రతుకు చితియె కాని గతమదేది?

ప్రథమపరిచయమ్మె ప్రళయజలధివోలె
కణకణమ్ములోన కలక రేపె!
కలత పాటు ఫలమె కలహ వృత్తాంతమై
స్మృతి సహస్రమునకు వెతలుమేపె !

కందిపోవు నీ పసందైన దేహమ్ము
అంతరంగమునకు అడ్డుగోడ!
చపల భావముల సజావుగా పోషించు
గుడిసె నీకు లత్తుకోరు మేడ!

ఇరుకుటింటి తలుపు లిరుసుగా వరుసగా
దినము గడుపు పడుపు దృష్టినీది!
కానరాని కత్తి గాయమై మాయక
చేదుబంధమైన చేష్ట నీది!

సాగిమూగవోవు సాయంత్రములలోన
గదులముందు, వింత కలకలమ్ము,
కలకలమ్ము మౌన కలహ సంకలనమై
కలవరింతలోనె కరగనిమ్ము.

పల్లవించుచున్న అల్లరి గల్లీల
గుస గుసలకు నీవు గుల్మొహరువు!
కరకు గుండె పండుగల కోస మురుకు నీ
మిస మిసలకు మేలి ముసుగె బరువు!

గదులు రెండు నేడు హృదయ సమాధులై
కప్పుకొన్న జ్ఞాపకమ్ము లెన్ని?
దీన గేహములను తిలకించు కవితాత్మ
గాయపడిన విధుర మడియలెన్ని?

నీ కుటీర మెదుట నిగ్గుటద్దము వోలె
వెలిగి తుదకు మథనవేదినైతి!
కోటి సంకటముల కూటమ్ము లెదలోన
కనలగా విషాద గాథనైతి!

ఆ మిటారి గోటిగోములో
కోరికలకు మౌనఘోషలెన్నో!
ఆ కటారి కంటిరేకులో మొగలాయి
మైకమొసగు రుధిరమధువులెన్నో!

ఇటులనే మిటారి కుటిల ప్రయోగమ్ము
మథన ముర్మురముగ మారనిమ్ము.
అటులనే కుటీరనటినై పాటమరించు
ఆ కసాయి హోయి నారనిమ్ము.

# కాకి–నక్క

— పిడవర్తి వెంకటరామశాస్త్రి

ఏదేశమేగినా
ఎచట కన్నెత్తినా
కాకికాకే. నక్కనక్కే
సైబీరియాలోనూ
సహారాలోనూ
సత్యభూమిలోనూ
ఎక్కడఉన్నా
"లేక, ని విధుల నిర్వర్తించు.
అని మేల్కొలుపుతుందికాకి

ఏ ముక్కు మొలిచినా
ఏ రంగు కలిగినా
ఏ పలుకు పలికినా
ఏ బువ్వబొక్కినా
మహా మానవ మేధ చెప్పేది ఒక్కటే
హాన్యా,హాన్యా' ఇదేం కాకిగోల
అంటుంది నక్క
తనకూత ఎక్కడి కక్కడ
వేరనుకొంటూ.

# శూన్య హేల

— ధర్మవరపు బుచ్చిపాపరాజు

చుక్కల నడి సంద్రపుటలలో
ఊగాడే పడవే జాబిలి
మక్కువైన రిక్కలలో
ఫక్కుమనే మిణుగురు హేల।
ఉత్తర దక్షిణ పాలపుంత
సూర్యగతిని ఆపదు వింత!
అనంతపుటంచుల అంతంలో
భూనభాల ప్రేమోన్మాదం
కనిపించదు గీతపు ఒరవడి
కనిపించదు ప్రకృతి ఉరవడి
అందించదు గగనపు పరవడి
చిందించదు శూన్యపు మెరవడి!

ఎల్లందు ఖమ్మం జిల్లా

# భయం !

తన నధః పాతాళానికి తొక్కేసినా
తిరిగి మొక్కగా తలెత్తి —మానై
రోటీ-కపడా ఔర్ మకానై
(కూడు-గుడ్డ-నీడై)

పాయపడుతుంది విత్తనం-ఆదేనయం.
తననెంత ఎత్తుకు ఎదగనిచ్చినా
మృగమై- రాక్షసుడై- పామై
కాటేసి తీరతాడు మనిషి
అదేభయం



# అబ్సర్డ్ నాటకాలు-3

— శ్రీ వేమూరి ఆంజనేయశర్మ

మనో విజ్ఞానశాస్త్రం వ్యక్తికి సంబంధించిన అసామాన్య వ్యవహారాలను పరిశీలించి ప్రతివ్యక్తి ఎక్కడో ఒకచోట అసామాన్యంగా వుంటాడని నిర్ధారణ చేసింది ఆతని జీవిత వ్యవహారాలలో లేక ఆతని ఆచరణలో "సంగతి" ఉండదు. ఏ హేతువూ, ఏ తర్కమూ ఆ అసామాన్య వ్యవహారాన్ని స్పష్టం చేయలేదు. వివరించలేదు. పగలుకూడా కొవ్వొత్తి. వెలిగించి దాని వెలుతురులో సాహిత్యరచన చేసిన వారున్నారు. ఉపన్యాసం చేస్తున్నంతసేపూ కోటు గుండీలు సర్దుకొనేవాళ్ళూ, టోపీ సవరించుకొనేవారూ ఉన్నారు. పాఠం వింటూనో, ఏవైనా మాటలు వింటూనో పెన్సిలుతో లేక కలంతో కాగితంమీద గీతలో, బొమ్మలో గీసేవారున్నారు. ప్రతి వ్యక్తి ఆచరణనూ నిశితంగా పరిశీలిస్తే ఇటువంటి అసంబద్ధ విషయాలను చాలా మనం గుర్తించగలం. ఇది ఏమిటి ? ఎందుకు జరుగుతున్నది ? అని ప్రశ్నవేస్తే దానికి జవాబు మనోవిజ్ఞానశాస్త్రం స్పష్టం చేస్తున్నది

మానవ జీవిత వ్యవహారమంతా సాంఘిక కట్టుబాట్ల మీదనో, సాంస్కృతిక విధానాల మీదనో ఆధారపడి నడుస్తున్నది. అది ప్రకృతి సిద్ధంగా స్వాభావికంగా వుండడంలేదు ప్రకృతి నిర్మించిన వ్యక్తి వేరుగానూ, కుటుంబము, సంస్కృతి, పరిసరాల ప్రభావం వలన మారిన, మారుతున్న వ్యక్తి వేరుగానూ కనబడుతున్నాడు. ప్రకృతికి దగ్గరగావున్న వ్యక్తిలో ఈ అసామాన్యతత్వం ఎక్కువ వున్నదనిపిస్తున్నది. అది ఆతని నిజస్థితి. మిగిలినది ఆతనిమీద ఆరోపించబడినది. విచిత్ర మేమంటే మనుష్యుడు ఏది "కాదో" అది కావడానికి ప్రయత్నిస్తున్నాడు. అంటే "ఉండడం" నుండి కావడానికి చేసే ప్రయత్నంలో మనుష్యుడు విచిత్ర స్థితికి చేరుకొంటున్నాడు. అందువలన ఆతని వైయక్తికమైన కోరికలమీద నియంత్రణ ఏర్పడుతున్నది. తాను అనుసరించవలసిన సామాజిక భూమిక కారణంగా తన జీవితాన్ని అందు కనుగుణంగా మలచుకొనే స్థితిలో అతడుండి పోతున్నాడు. ఆ ప్రయత్నంలో అసంగతులు విసంగతులు ఏర్పడుతున్నవి. అబ్సర్డ్ నాటకాలు ఆ స్థితిని విశ్లేషించడానికి ప్రయత్నం చేస్తున్నవి. నాటకం అనగానే ఒకటి గుర్తుంచు కొనవలసి వుంటుంది. నాటకంలో ఒకపాత్ర ఇంకొక పాత్రను తనమీద ఆరోపించుకొని ఆ ఆరోపిత పాత్ర వ్యక్తిత్వానికి అనుగుణ్యంగా ప్రవర్తిస్తుంది. నటుడు పాత్రలో తల్లీనం అవుతాడా కాడా అనేది ఇంకొక పెద్దవిషయం. మనవారూ పాశ్చాత్య శాస్త్రకారులూ ఈ విషయమై అనేక నిర్ణయాలు చేసివున్నారు. నిజమాలోచిస్తే అసలు మన జీవితమే ఒక నాటకంగా వున్నది. వ్యావహారిక జీవితంలో ప్రతివ్యక్తి కొత్త కొత్త భూమికల్ని నాటకంలోలాగానే నిర్వహిస్తున్నాడు. అక్కడే "అసంగతి విసంగతి" ఏర్పడుతున్నది. అసంగతిని ఎంత బాగా చిత్రిస్తే ఆ నాటకం అంతగా అబ్సర్డ్ నాటక రూపాన్ని ధరిస్తున్నది.

జీవితానుభూతులే నాటకంలో అభివ్యక్త మవుతుంటవి గనుక జీవితంలోని విసంగతులు

అసంగతులు వ్యక్తంగాక తప్పదు. స్వాభావిక జీవిత వ్యవహారాలు మన నియంత్రణలో వుండేవికావు. వాటికి మనం భోక్తలమే గాని కర్తలం గాము. జీవితాన్ని రంగంమీద చూపిస్తున్నప్పుడు అసంగతుల చిత్రణ జరిగి తీరుతుంది. మానవుని ఆంతరంగిక జీవితాన్ని చిత్రించినప్పుడు ఇది మరీ కొట్టవచ్చినట్లు కన్పించి తీరుతుంది. బహిరంగ జీవితంలోనే విసంగతులు కోకొల్లలుగా కన్పిస్తున్నప్పుడు ఆంతరంగిక జీవిత చిత్రణంలో విసంగతులు కన్పించడం ఆశ్చర్యకరమైన విషయంగాదు. అబ్సర్డ్ నాటకాలు మానవుని నిజరూపాన్ని, స్వస్వరూపాన్ని చిత్రించే ప్రయత్నం చేస్తున్నవి మనుష్యుని లోపలి ప్రపంచం ఒకటైతే బయటి ప్రపంచం ఇంకొకటిగా వుంటున్నది. ఈ లోపలి బయటి ప్రపంచాల మధ్య సరైన "సంవాదస్థితి" సమన్వయస్థితి ఏర్పడడంలేదు. బయటి ప్రపంచంలో దెబ్బలుతిని లోపలి ప్రపంచం తల్లడిల్లి పోతున్నది రచయిత ఆ స్థితిని గురించి ఆలోచిస్తూ వుంటాడు. మానవుడు సహజజీవితాన్ని ఎందువల్ల అనుసరించలేక పోతున్నాడు ? ఇది అసలు ప్రశ్న. జీవితాన్ని పరిశీలించేదృష్టి రెండురకాలుగా వుంటుంది. ఒకటి సకారాత్మకదృష్టి, రెండోది నకారాత్మకదృష్టి సాహిత్యంలో గూడా అంతే. అబ్సర్డ్ నాటకాలలో నకారాత్మకరూపం చిత్రించ బడుతున్నది. అసలు పాశ్చాత్య జీవిత దర్శనం నకారాత్మకమేగాక విస్పష్టమైన కఠోర యథార్థవాద దృక్పథంతో కూడి వుంటున్నది. మన జీవితదర్శనం అనగా భారత జీవిత దర్శనం సకారాత్మకం, ఆదర్శ వాదాత్మకం. జీవన దృష్టులేమైనా ఇద్దరి జీవితానుభూతులూ ఒక్కటిగానే వుంటున్నవి. వాస్తవిక ప్రపంచంలోని అనుభూతి దృష్టితో ఆలోచిస్తే ప్రేక్షకుడు, లేక పాఠకుడు ఆదర్శానికంటే యదార్థానికి దగ్గరగా వుంటున్నాడు. అదిసత్యం. అందువల్ల కొత్తశైలిలో, కొత్త పద్ధతిలో తన ఆంతరిక అనుభూతుల యదార్థ చిత్రణ ఎక్కడైనా జరిగితే అటువైపుకు తొందరగా అతడు ఆకర్షింపబడుతున్నాడు. అబ్సర్డ్ నాటకాల వ్యాప్తికి అది గూడా ఒక ప్రధాన కారణం. సాహిత్య జగత్తులో కొత్త ప్రయోగాలు జరపడం స్వాభావికం. జీవితాన్ని వున్నదున్నట్లుగా, జీవితానికి దగ్గరగావుండి చిత్రించడం జరిగితే పాఠకులు ఎక్కువగా ఆకర్షించ బడతారు అది గూడా స్వాభావికమే.

అబ్సర్డ్ నాటక విధానం విశ్వయుద్ధాల తరువాత వ్యాప్తిలోకి వచ్చినట్లు మనం తెలుసుకొని వున్నాము ఆదే సమయంలో ఫ్రాంసులో అస్తిత్వవాదపు నాటకాలూ, అమెరికాలో "హేపినిజం" నాటకాలూ, యూరపంతటా అబ్సర్డ్ నాటకాలూ సమానాంతరంగా ప్రచారంలోకి వచ్చాయి. అస్తిత్వవాదపు నాటకాలలో భాషకూ, శబ్దానికీ వ్యాప్తి లభిస్తే, హేపినిజం నాటకాలలో దృశ్యాలకు ప్రాధాన్యం లభించింది. అబ్సర్డ్ నాటకాలలో రెండింటికీ ప్రాధాన్యం లభించింది ఈ ప్రక్రియలో ఆనాటకం, యాన్టీ థియేటర్ వంటివి వ్యాప్తిలోకి వచ్చాయి. ఇదే సందర్భంలో థర్డ్ థియేటర్ గూడా ప్రచారంలోకి వచ్చింది. రాబర్ట్ తన పుస్తకంలో దానిని బాగా వివరించాడు. 1945 నుండి యుద్ధసంబంధమైన నాటకాలుగూడా బాగా వ్యాప్తిలోకి వచ్చాయి. ది థియేటర్ ఆఫ్ మిక్సెడ్ మీన్స్ అనే పుస్తకంలో రిచర్డ్ ఇంకొక రకమైన నాట్యశైలిని గురించి వివరించాడు. ఆ శైలిలో భాష, సంగీతము, నృత్యము, లైటింగు, చిత్రకళ, ఆధునిక యంత్ర సామగ్రి మొదలైన వాటికన్నింటికీ స్థానమున్నది. నిశితంగా పరిశీలించిచూస్తే ఈ విధానాలన్నీ అబ్సర్డ్ శైలిలో అంతర్భూతంగా వున్నట్లు స్పష్టంగా తెలుస్తుంది. బెకెట్ కథనం ప్రకారం స్వప్నంగూడా ఒక నాటకరూపమే. స్వప్నంలో స్వప్నం చూచేవాడు కర్తగా వుంటాడు. స్వప్నం మధురంగా వుంటుంది. అయితే దానికాధారం యథార్థమే. యథార్థమే విఘటితమై స్వప్న రూపాన్ని ధరిస్తుంది. అబ్సర్డ్ నాటకాలలో జరిగేదదే. అయితే వున్న విచిత్రమేమంటే కథా గమనంగానీ, పాత్ర పోషణగానీ, ఘటనా

ప్రాముఖ్యంగానీ, క్రమబద్ధమైన సంభాషణా విధానంగానీ ఈనాటకాలలో ఏమీవుండవు. రసనిష్పత్తీ, ఆది మధ్యాంతాలూ అనేవి వుండవు. నాటకమంతా అగమ్య గోచరంగా వున్నట్లు కన్పిస్తుంటుంది. కాని అవి ప్రేక్షకుని హృదయాన్ని కదిలిస్తుంది. అందువల్లనే అంతమంది రచయితలు ఆ నాటకాలు వ్రాశారు. వేలమంది ప్రేక్షకులు ఆ నాటకాలను చూచి ఆనందించారు. సర్రియలిజాన్ని గురించిలాగానే ఈ నాటకాలను గురించి గూడా చాలా అపప్రథలు లేకపోలేదు. కొత్త టెక్నిక్‌ను అవలంబించినప్పుడల్లా పాతవారు ఈసడించడం మనం చూస్తూనే వున్నాము. వ్యతిరేకించడం గూడా మనమెరుగుదుము. అయినా కొత్తప్రయోగాలు జరుగుతూనే వుంటవి. వాటికిగల శక్తినిబట్టి అవి బుద్ధిజీవుల్ని, వేధావుల్ని ఆకర్షిస్తూనే వుంటవి. పాశ్చాత్య దేశాలలో ఇటువంటి కొత్త ప్రయోగాలు పారిస్‌లో జరగడం విచిత్రమైన అంశం అబ్సర్డ్ నాటక రచయితలు వివిధ దేశాలకు చెందిన వారయినా వారు పారిస్‌లో వుండి కొత్త కొత్త ప్రయోగాలు చేశారు పారిస్ పట్టణంలోని వాతావరణం అందుకు ఉపయోగించినట్లు కన్పిస్తున్నది. పారిస్‌ను గురించి మార్టిన్ ఎస్లిన్ ఈ క్రింది విధంగా వ్రాశాడు

'As a powerhouse of the modern movement Paris is an international rather than a merely French Centre: it acts as a magnet attracting artists of all nationalities who are in search of freedom to work and to live non-conformist lives unhampered by the need to look over their shoulder to see wheather neighbours are shocked. That is the secret of Paris as the capital of the world's individualists: here, in a world of cafe's and small hotels it is possible live easily and unmolested. An Irishman, Samuel Beckett, A Rumanian Eugen Ionesco;, a Russian of American origin, Arthur Adamov not only found in Paris the atmosphere that allowd them to experiment in freedom. They also found there the opportunities to get their work produced'.

Martin Esslin.

పారిస్ నగరం కొత్త సాహిత్యోద్యమాలన్నింటికీ పవర్‌హౌస్ వంటిది. దానిని ఫ్రెంచివారి నగరమనడం కంటే అంతర్జాతీయ నగరమనడం న్యాయ సంగతం. అన్నిదేశాల కళాకారులనూ కొత్త ప్రయోగాలు చేసేవారందరినీ ముక్త హృదయంతో ఆ నగరం ఆహ్వానిస్తున్నది. వ్యక్తివాదుల రాజధాని నగరమది అని కూడా అనవచ్చును ఐరిష్ బెకెట్, రుమేనిమన్ అయినెస్కో, రష్యన్ ఆదామోవ్ మొదలైన వివిధ దేశాల రచయితలు స్వేచ్ఛా వాతావరణంలో కొత్త సాహిత్య పయోగాలు ఆ నగరంలో చేయగలిగారు. అది ఆ నగరం ప్రత్యేకత.

అబ్సర్డ్ నాటకాలఉద్యమం వ్యక్తివాదులఉద్యమం. కొత్తప్రయోగం. యూరప్‌లోని బుద్ధిజీవుల్ని ఇది ఆకర్షించింది నాటకరంగంలో ఒక విశిష్టస్థానాన్ని సంపాదించుకొన్నది. ఈ నాటక స్వభావాన్ని, రూపాన్ని మార్టిన్ ఎస్లిన్ వివరించివున్నాడు. దానిని బట్టి ఈ నాటకతత్వాన్ని బాగా అర్థం చేసుకొనవచ్చును.

"Inevitably, plays written in this new convention will, when judged by the standards and criteria of another, be regarded as impertinent and

outrageous impostures. If a good play must have a cleverly constructed story, these have no story or plot to speak, if a good play is Judged by substletey of characterization, these are often without recognizable characters and present the audience with almost mechanical puppets; if a good play has to have a fully explained theme, which is neatly exposed and finally solved, these often have neither a beginning nor an end; if a good play is to hold the mirror upto nature and portray the manners and mannerism of the age in finely observed sketches, these seem often to be reflections of dreams and night mares. If a good play relies on witty repartee and pointed dialogue, these often consist of incoherent baddlings."

Martin Erlin

ఆ నాటకాలలోని సంభాషణల నమూనాలు పాత్రల మనఃస్థితినిఎంతబాగా వివరిస్తున్నవో చూడండి. సంభాషణలుఈ నాటకాలకు మూలస్వరాలు.

ఎండ్‌గేమ్ నాటకంలో

హేమ్-కిటికీ తెరువు

క్లోవ్-ఎందుకు ?

హెమ్-సముద్రపు హోరు వింటాను.

క్లోవ్–అది నీ కెప్పుడూ వినబడదు.

హెమ్-కిటికీ తెరచినా గూడానా ?

క్లోవ్-అవును.

హెమ్-కిటికీ తెరచినా గూడా ప్రయోజనం లేదంటావా ?

క్లోవ్-లేదు.

ఇది రెండు పాత్రల సంభాషణ. ఇది వారి మనః స్థితిని తెలియ జేస్తున్నది.

* * * * *

బెకెట్ నాటకం వైటింగు ఫర్ గోదోలో—

వ్లాడిమిర్-వారు ఏమంటున్నారు ?

ఎస్ట్రి-తమ తమ జీవితాన్ని గురించి వివరిస్తున్నారు.

వ్లాడి-వివరణ గూడా ఎందుకు ? అసలు జీవించి వున్నారు. అది చాలదా ?

ఎస్ట్రి-ఆ విషయాలు మాట్లాడడం వారికిష్టం.

వ్లాడి-చచ్చిపోతే సరిపోదా ?

ఎస్ట్రి-సరిపోదు.

(కొంచెం సేపు నిశ్శబ్దం)

వ్లాడి–అబ్బా ! పక్షి రెక్కలలాగా చప్పుడు చేస్తున్నారు. అరుస్తున్నారు.

ఎస్ట్రి-ఆకులలాగా.

వ్లాడి-బూడిదలాగా

ఎస్ట్రి-ఆకులలాగా

(నిశ్శబ్దం

వ్లాడి-ఏదో మాట్లాడు.

ఎస్ట్రి-ప్రయత్నం చేస్తున్నాను.

వ్లాడి-మాట్లాడు. మాట్లాడు. కాలం గడిచేదెట్లా?

ఎస్ట్రి–కొంత సేపు మాట్లాడడం మానివేద్దాం. నీ కేమీ అభ్యంతరం లేదుగదా ?

వ్లాడి-సరే

అయనెస్కో నాటకం ది బాల్డ్ ప్రెమాడోనోలో సంభాషణ

మిష్టర్‌స్మిత్-(పత్రిక చదువుతూ) ఛ్ఛ ! వాట్సన్ మరణించాడు.

మిసెస్‌స్మిత్-అయ్యో భగవంతుడా ! పాపం ! ఎప్పుడు ?

మిష్టర్‌స్మిత్-ఎంతనటన ! వాడు మరణించి రెండు సంవత్సరాలయింది. అది నీకు తెలుసు. వాడి అంత్యక్రియలకు ఇద్దరం హాజరైనాము. జ్ఞాపకముందా?

మిసెస్‌స్మిత్-అవును. జ్ఞాపకం వచ్చింది. అదిసరే. ఆ వార్త చదివితే నీ కెందుకంత ఆశ్చర్యం కలిగిందో నా కర్థంగావడం లేదు.

స్మిత్-అది ఈ పత్రికలో వ్రాసిలేదు. వాడు మరణించి రెండు సంవత్సరాలయింది. ఇప్పుడు మళ్లీ జ్ఞాపకం వచ్చింది

మిసెస్‌స్మిత్-ఆశ్చర్యకరం. ఆ ఘటన నీకు ఎంత బాగా జ్ఞాపకం ఉన్నది.

ఈ భార్యాభర్తల సంభాషణ కాలం గడపడానికి జరిగింది. ఆ చనిపోయిన వ్యక్తిమీద ఈ ఇద్దర్లో ఎవ్వరికీ సానుభూతి లేదు. అయినా మాట్లాడు తున్నారు. ఆ దంపతులమధ్య మానసికంగా ఎన్నో మైళ్లదూరం వ్యాపించివున్నదని ఈ సంభాషణ రుజువుచేస్తున్నది.

ఇదే విధంగా ఎన్నో ఉదాహరణలు చూపించ వచ్చును. అబ్సర్డ్ నాటక రచన క్రొత్తటెక్నిక్‌ను అనుసరించి కొత్తదోవలు తొక్కింది. మొదట మొదట ఈ నాటకాలు ప్రేక్షకులకు అర్థంగాలేదు. టెక్నిక్ బోధపడలేదు. కాని రానురాను ఆ నాటకాలు ప్రేక్షకుల మన్ననలు పొందడమేగాక పాశ్చాత్యనాట్య విధానంలో ప్రత్యేక స్థానాన్ని సంపాదంచుకొన్నవి. *

# సానుభూతి

ఒంటరిగా...
తలవంచుకొని
పరధ్యానంగా నడుస్తున్నాను
అకస్మాత్తుగా...వినిపించింది
ఓ...జీరవోయిన కంఠ ఆర్తనాదం
నిశ్చలంగా వున్న నా హృదయం
జలదరించింది
పరిసరాలు పరికిస్తూ...
ఉలిక్కిపడ్డాను
పీలికగుడ్డల మధ్య
కాంతిలేని కళ్ళతో
దుమ్ము ధూళిపై
చలికి వణుకుచూ
భరించలేక మూల్గుతూ
ఆకలి... చలి బాధల మధ్య
ఓ.... ఎముకల గూడు
సతమతమౌతూ...

నా వైపే చూస్తుంది... ఆశగా
ద్రవీభవించిన నా హృదయంలో
దుఃఖం పెల్లుబికింది
నీళ్ళు కమ్మిన కళ్ళతో
మసక మసగ్గా......
అటువైపే చూశాను
ఆదుకుందామనే వుంది
కానీ ......
నేను నిరుద్యోగిని
నేనేమి చేయగలను...!?
సానుభూతికి
రెండు......
కన్నీటిబొట్లు తప్ప ...!?

—బుర్రా రత్నరాజు
(ఎం. ఏ. లిట్.)
లెక్చరర్, ఎన్.వి ఆర్.ఎమ్. కళాశాల,
నగరం-522268.
రేపల్లెతాలూకా, గుంటూరు జిల్లా

నల్లజర్ల రోడ్డు (తిలక్ కథలు)

# మనస్తత్వ చిత్రీకరణ

— అన్వేషి

ఇతివృత్తం:- నల్లజర్ల అడవి మీద చంద్రుడు భయంకరంగా ఉదయించాడు అనే కొత్తపదజాలంతో కథ మొదలవుతుంది.

అవధానిగారి తోటలో ఆచారి నారాయణలతో సంభాషిస్తుంటే కరెంట్ పోతుంది, ఆ చీకట్లో తేనీటి విందు అనంతరం తన బాల్యంలో జరిగిన భయంకరమైన సంఘటనను అవధాని వారిరువురికి చెపుతుంటారు. తోట ఊరికి దూరంగా, శ్మశానానికి దగ్గరగా, నిశ్శబ్దంగా ఉటుంది. చీకటి, కీచురాళ్ళ ధ్వని, నక్కల వికృతమైన అరుపులు నిశ్శబ్దం— సహజంగా పిరికివాడైన ఆచారికి భయుం కలుగజేస్తుంటాయి.

అవధానిగారు అతని మామయ్య నాగభూషణం వారి బంధువు రామచంద్రం ఏలూరులో తమపని ముగించుకొని ఉదయం కలెక్టర్ గారింట్లో పెండ్లికి వెళ్ళడానికి రామచంద్రం గారి కారులో రాత్రిపూట తణుకువైపు ప్రయాణం చేస్తుంటారు.

కారు నల్లజర్ల అడవిలో ఆగిపోతుంది. భయంకరమైన అడవి, చిరుతపులి తిరుగుతుందని వినడం వల్ల, నిశ్శబ్ద వాతావరణం వలన వాళ్ళు చాలా భయపడుతుంటారు.

రామచంద్రం కారు బాగుచేయటం కోసం కర్ర ముక్కకోసం వెదుకుతూ పొదల్లోకి వెడతాడు. రామచంద్ర పాముకాటుకు గురై ప్రాణాపాయస్థితిలో ఉంటాడు. నిస్సహాయంగా భయంకరమైన అడవిలో మృత్యువుతో పోరాడుతున్న రామచంద్రానికి ఏ సహాయంచేయలేక భయంతో నాగభూషణం. 18 ఏండ్లవాడైన అవధాని అందుకు తోడుగా ఏ వైపు నుండి చిరుతపులి దాడి చేస్తుందోననే భయం.

రామచంద్రం... భూషణం నా.... భార్య నా... పిల్లలు...రక్షించూ....అంటూ ఏవేవో దీనంగా అర్థిస్తూ నురగలు కక్కుకొని స్పృహకోల్పోతుంటే అమితమైన బాధతో శరీరం వంకరలు తిరుగుతుంటుంది. ఇవన్నీ చూడడంతో భయపడుతున్న అవధాని దూరాన హఠాత్తుగా మంటరెగడంతో.... సహజంగా బలహీన మనస్కుడవడం వల్ల మామయ్యా దెయ్యం అని అరచి స్పృహ కోల్పోతాడు. ఆ తరువాత తేరుకొని భయంతో బాధను. ఒంటరితనాన్ని. నిస్సహాయతను భరించలేక ఏడుస్తున్న నాగభూషణాన్ని చూస్తాడు.

మొదట దెయ్యంగా భ్రమించి భయభ్రాంతులైనా ఆ తరువాత అతన్ని పాముల సిద్ధయ్యగా పరిచయం చేసుకోవడం వల్ల అతని సహాయం అర్థించి సిద్ధయ్య సూరీడుల సహాయంతో రామచంద్రాన్ని మృత్యుముఖం నుండి తప్పించి హాయిగా విశ్రాంతి తీసుకొంటారు.

సిద్ధయ్య డబ్బులు తీసుకోవడానికి నిరాకరిస్తాడు. వారిని బస్టాండుకు సాగనంపడానికి సూరీడును తోడుగా పంపుతాడు.

అవధాని, భూషణం రామచంద్రం బస్సుఎక్కబోతుండగా సూరీడు పరుగెత్తుకుంటూ వచ్చి బాబయ్యా మా అయ్యని నల్లతాసు గరళం తియ్యబోతొంటే

కాచేసింది. భయం వేస్తోంది. ఒంటరిగా ఉండలేను, తోడుగా రమ్మని ఏడుస్తూ ప్రార్థిస్తుంది. కలెక్టర్ గారి పెండ్లిలో రిసెప్షన్ బాధ్యతంతా తమదే. దాన్ని వదలుకొంటే ఎంతో అప్రతిష్టంగా భావించిన రామ చంద్రం విచారంగా.... మాకేమయినా మంత్రం వచ్చునా లేక తంత్రం వచ్చునా.... ఈ డబ్బులు తీసుకెళ్ళి మీ అయ్యను పట్నంలో చూపించుకో అంటూ సూరీడు అభ్యర్థనని త్రోసిపుచ్చి జాలిపడుతూ వెళ్ళి పోతారు.

అవధాని బాధతో భారంగా ఈ సంఘటనను ముగించి గతంలోకి జారుకొని సూరీడు సిద్ధయ్యా ఏమయ్యారని ఆలోచిస్తుంటాడు.

—o—

మనస్తత్వ చిత్రీకరణ :—

తిలక్ కథలలోని ప్రతి పంక్తి మనస్తత్వాల్ని ప్రతిబింబిస్తుంటుంది అంటే వాస్తవం ఇందులో యథా తథంగా చిత్రీకరింప బడిందన్నమాట వాస్తవాల్ని అర్థం చేసుకోవటం ఎంతకష్టమో, వాస్తవాల్ని సత్యాల్ని అక్షరరూపంలో అమర్చటం అంతేకష్టం. వాస్తవాల్ని రాయగలిగినవాడే రచయిత. ఇది ఒక ఉన్నతమైన పుస్తకం. అంతర్యాలకు దర్పణం. సమాజం తన్ను తనలోని కుళ్ళును, బూజును, నాగరికతను, సంస్కృతిని ఇందులో చూసుకోవచ్చు. మనిషిని తనకు తనను చూపుతుంది ఈ పుస్తకం

ఆచారి :-

ఇతివృత్తం మీకు పరిచయం చేయబడ్డదే. ఇతను అవధానికి మిత్రుడు కాని, వీరిమధ్య వయస్సుల అంతరం చాలా ఎక్కువ.

మన సమాజంలో ఆచారిలాంటి వాళ్ళే అత్యధిక శాతం. సమాజ దుస్థితికి, దుర్గతికి, మూఢాచారాలకు బానిస సంస్కృతికి వీళ్ళే మూలస్థంభాలు. భయస్థుల వల్ల వారికే కాక సాటి మానవులకు నష్టం కలుగుతుంది. మనిషి మనిషిగా నిలవాలంటే మొదట ఈ లక్షణాలన్నీ వదులుకోవాలి. ఇతని స్వభావ చిత్రీకరణ ఎంత సహజంగా ఉందో...ఈ రచయిత ఎంత గొప్ప పరిశీలకుడో మనం తెలుసుకొద్దాం...

ఈ రాత్రికింక లైట్లురావు. ఎక్కడో తీగతెగి పోయింది అంటాడు నారాయణ,

తోట అంతా చీకటైపోయింది అన్నాడు ఆచారి నెర్వెస్‌గా. అస్థిమితంగా చేతివేళ్ళతో బల్లపై ఆది తాళంవేస్తూ, కొవ్వొత్తులున్నాయాండీ అని ఆచారి అడిగాడు అవధానిని.

అవధాని చెప్పేవిషయంకన్నా ఆచారిదృష్టి చీకటిని గూర్చి, కరిగిపోతున్న కొవ్వొత్తి గూర్చి కలవర పడుతూ...తోటలోని గలగలమనే.... ఆకుల శబ్దా లకు సైతం భయపడి దొంగలేమో అని ఉలిక్కిపడ తాడు. అవధాని, నారాయణా అతన్ని పట్టించుకోరు.

హఠాత్తుగా కొవ్వొత్తి అయిపోయిందండోయి అంటాడు భయంగా. అవధాని మరొకటి వెలిగిస్తూ... ఇంకా ఒకటే ఉందనగానే చచ్చాం అంటాడు భయంగా ఆచారి. తోటలో నిండుకొన్న చీకటి వంకా, కరుగు తున్న కొవ్వొత్తివంకా దిగులుగా చూస్తుంటాడు. నక్కల అరుపులు వినబడగానే వాటి గూర్చి ప్రశ్నిం చిన ఆచారికి మాతోటలోకాదు శ్మశానంలొ ఉన్నాయి. శ్మశానం మా తోటకు దగ్గరగా ఉంది అంటాడు అవ ధాని. జాగ్రఫీ మాష్టారు సరిహద్దుల గూర్చి చెప్పినంత తేలిగ్గా చెప్పారేంటండి అన్న ఆచారి వంక నారాయణ, అవధాని నిరసనగా చూచి కోపగించుకొంటాడు.

నాకు దెయ్యాలంటే తెగభయం .... అయితే .... హ...హి...హి...నెర్వెస్‌గా నవ్వుతూ, భయాన్ని దాచుకోడానికి బల్ల మీద జోరుగా ఆదితాళం వేస్తూం టాడు ఆచారి.

వికృతంగా, ఘోరంగా వినిపించే నక్కల అరుపు లను, కీచురాళ్ళ ధ్వనులను వింటూ, చీకటిని కరుగు

తున్న కొవ్వొత్తిని దిగులుగా చూస్తూ, ఆకుల సవ్వడులు. మధ్య మధ్య భయంకరమైన అవధాని కథ వింటూ ఉండటంవల్ల భయంకంపితుడైన ఆచారి వణుకుతూ నెమ్మదిగా నారాయణ చెంతచేరి అతని నడుము కౌగిలించుకొని కూర్చుంటాడు.

ఆరిపోతున్న కొవ్వొత్తివంక చూస్తూ అసందర్భంగా ఈ తోటలో పాములున్నాయాండీ ... అని అడుగుతుండగానే కరెంట్ వస్తుంది. ఆచారి ఆనందంగా నవ్వుతుంటాడు.

పిరికివాళ్ళ మనస్తత్వానికి ప్రతీక ఆచారి. భయాన్ని కప్పిపుచ్చుకోడానికి, భయంనుండి పారిపోడానికి అతను చేసే చేష్టలు, అసందర్భపు ప్రశ్నలు అతని మనస్థితి ఎంత ఆందోళనకరంగా ఉందో తెలుపుతుంది. రచయిత పిరికివాళ్ళు ఇతరుల కార్యక్రమాల్ని సక్రమంగా, సవ్యంగా జరక్కుండా ఎలా అడ్డుపడతారో, వారి ఆలోచనాస్థితి, ధ్యానం ఎంత అస్థిమితంగా ఉంటుందో ఆచారి పాత్రద్వారా తెలియ చేసారు.

రామచంద్రం :-

M A. చదివాడు. టెన్నిస్ చాంపియన్. క్లబ్బు కార్యదర్శి, సేవాసదన గౌరవాధ్యక్షుడు. కాని అతని కేం తెలియదు. అతను భార్యని ప్రేమిస్తాడో, లేక భార్యవల్ల, వచ్చిన ఆస్తిని ప్రేమిస్తాడో తెలియదు. కట్టేది ఖద్దరు, జిల్లాబోర్డు ప్రెసిడెంటుది ఏపార్టీ అయితే ఇతనిదీ అదే పార్టీ. కలెక్టర్, మంత్రి ఎవ్వరు వచ్చినా బస వీరింట్లోనే ఇది ఇతని గత చరిత్ర.

ఆరుమైళ్ళ తరువాత ఆగిపోయిన కారును చూచి వెధవకారు అంటాడు నాగభూషణం. అర్జునుడు తన గాండీవాన్ని తిట్టినా సహిస్తాడేమో గాని నా కారును తిడితే నేనూరుకోను. ఇలాంటి యింజను ఇండియాలోనే లేదు, అంటాడు. రామచంద్రం. స్వంత వస్తువులపైన మనుష్యులకుండే ఆప్యాయతా, ప్రేమలన్నీ, తనదనుకొన్న వాటిని తిడితేసహింపలేని మనిషి తత్వాన్ని తెలియచేస్తుంది ఈ సంభాషణ.

అటుగా వెళ్ళుతున్న ఓ వ్యక్తి వీరికి "నల్లజర్ల అడవిలో పులి తిరుగుతుంది, జాగర్తగా ఉండండి బాబు" అని చెబుతాడు.

నిశ్శబ్దంలో, చీకటి రాత్రి భయంకలిగించే ధ్వనులు నీడలు. నల్లజర్ల అడవిలో కారు మళ్ళీ ఆగిపోతుంది. ఓ వైపు అడవిలో చిరుతపులి తిరుగుతుందనే భయం.

అరగంట గడిచినా కారు బాగవ్వదు. దానితో కుస్తీలు పడుతున్న రామచంద్రం నాగభూషణం తన కారును తిట్టగానే సహనం కోల్పోయి. అబ్బ చంపకు, వెధవగోల నువ్వూ కార్లో కూర్చో ఊరివరకు తోస్తాను. నీ ప్రాణానికి నా ప్రాణం హామీ సరేనా" అని కోపంగా అరుస్తాడు సహనం కోల్పోయాక, పరిస్థితుల ప్రభావాల వల్ల మనిషి ప్రవర్తనా మారుతుంది.

కారు బాగు చేయడానికి కర్రముక్క అవసరం వచ్చినందు వల్ల దానికోసం చీకట్లో పొదల్లోకి వెళ్ళిన రామచంద్రం పాముకాటుకు గురవుతాడు.

ప్రాణభయం నిస్సహాయస్థితి, భయంకరమైన అడవి, మృత్యుముఖంలో నున్న రామచంద్రం వెర్రిగా ఏడుస్తూ భూషణం నా పిల్లలు నా భార్య అంటూ వణికిపోతూ శరీరం చల్లబడి నోటినుండి నురగలు కక్కుతూ స్పృహకోల్పోతాడు నిస్సహాయస్థితిలో మరోభయంతో మనిషి మానసిక స్థితిని చక్కగా చిత్రీకరించారు రచయిత. ఎంతటి ధైర్యవంతులైనా మృత్యు భయం వల్ల పిరికివాళ్ళవుతారు.

అడవిలోని పాములవాడు సిద్దయ్య వలన ప్రాణాలకు తెగించి అడవిలోకి ఒంటరిగా వెళ్ళి వేరు తెచ్చి పరిచర్యలు చేసిన సూరీడు వలన రామచంద్రం బ్రతుకుతాడు. అందుకు ప్రతిఫలంగా వారేం తీసుకోనందుకు బాధపడతాడు తన ప్రాణదాతలకు కృత

జ్ఞతలు తెలుపుకొని హడావిడిగా కలెక్టర్ గారి పెండ్లి కోసం బయలుదేరతారు.

రామచంద్రం వాళ్ళు బస్సుకోసం వేచిచూస్తుండగా సూరీడు వగరుస్తూ వచ్చి బాబు! మా అయ్యని పాము కరిసింది కొంచెం సాయం రండీ అంటూ ప్రార్థిస్తుంది ఏడుస్తూ మొదట బాధపడి తేరుకొని...... కలెక్టర్ గారి పెండ్లి ప్రాముఖ్యం గుర్తుకు వచ్చి మాకు మంత్రం వచ్చునా లేక తంత్రం వచ్చునా అంటూ 20 రూపాయలు ఇచ్చి ఈ డబ్బుల్తో పట్నంలో మీ అయ్యని చూపించు అంటూ హడావిడిగా ఆవిడ అభ్యర్థన త్రోసిపుచ్చి బస్సెక్కుతూ జాలి పడతాడు. కలెక్టర్ గార్కి మాటిచ్చి తప్పడంలోని అమానుషత్వాన్ని ఊహించుకొంటాడు.

సిద్ధయ్య సూరీడు సహాయం చేయకపోతే కలెక్టర్ గారి పెండ్లికి కాదు, తాను యమపురికి వెళ్ళేవాడననే నిజం తెలిసినా, ప్రతిఫలంగా పైసా తీసుకోకుండా ప్రాణంకాపాడి, ఆశ్రయమిచ్చి ఆతిథ్యమొసంగినా మనిషి ప్రాణంకన్నా కలెక్టర్‌గారింట్లో పెండ్లి ముఖ్యమైనదిగా తోచింది రామచంద్రానికి. మనష్యుల్లో చాలా మంది సహాయాన్ని ప్రతిఫలంతో తీర్చగలుగుతామనుకొంటారు. కాని నిజాన్ని విలువను గుర్తించరు. లేదా కృతజ్ఞతచెప్పి చేతులు దులుపుకొంటారు. ప్రాణాల్నిచ్చిన ప్రాణదాత కన్నా ఓ అధికారి పెండ్లి ముఖ్యంగా తోచింది. ఇది మానవ మనస్తత్వం... మన సమాజంలో అత్యధిక సంఖ్యాకులు వీరే డబ్బు ఇచ్చి ప్రాణాల్ని వెలగడుతున్న మనుష్యులు వింత పతనానికి దిగజారాగో డబ్బుకు ఎంత ప్రాధాన్యం ఇస్తారో స్వార్థానికి అధికారానికి ఎలా తలవంచుతారో తెలియ చేస్తుంది రామచంద్రం పాత్ర. ఒక బాధ్యతా రహితుడి కృతఘ్నుడి ప్రతీక ఈ పాత్ర

**నాగభూషణం**

ఇతను అవధానిగారి మామయ్య, రామచంద్రం గారి బావగారు.

నాగభూషణం "మిక్స్‌డ్ డబుల్స్ ఆడుతుందట ఆవిడెవరు?" అని ప్రశ్నించాడు "మిస్‌శర్మిష్ఠ" బదులు చెబుతాడు రామచంద్రం. బాగుంటుందా అంటే "ఆవిడా, ఆవిడ ఆటా" అంటాడు, రామచంద్రం రెండూనూ అంటూ నవ్వుతాడు భూషణం. ఆనవ్వు ఎలాంటిదో మనం ఊహించగలం. స్త్రీల పట్ల పురుషుల స్వభావధోరణులను తెలియచేస్తుంది ఈ సంభాషణ.

ఆగిపోయిన కారును రామచంద్రాన్ని విసుక్కుంటాడు భూషణం. అవధానిని ఉద్దేశించి వీడు ఎనిమిది గంటలకు పడుకోక పోతే, మా అక్కయ్య ఒకేసారి 8 మంది డాక్టర్లను పిలిపిస్తుంది అంటాడు కోపంగా, భయంగా. ధనంవతులు పిల్లల్ని ఎలా పెంచుతారో తెలియ చేస్తుంది ఈ వాక్యం.

ఆడవిలో, చీకటిలో, నిశ్శబ్దంలో నిలబడి ఉంటారు. భూషణం అవధాని. రామచంద్రంకారుబాగుచేస్తుంటాడు. హఠాత్తుగా మామయ్య చిరుతపులి ఇక్కడేనా ఉంది అని ప్రశ్నించడం వల్ల నిజంగానేమో ననుకొని ఒక్క గంతువేసి ఆ తరువాత వెధవాయ్ సడెన్‌గా అలా అన్నావేంటిరా, అని కోపగించు కొంటాడు. మధ్య మధ్యలో ప్లీడర్‌గారింట్లో పడుకున్నా బావుణ్ను... ఈ కారులో రాకుంటే పోయెది. వాళ్ళుండ మన్నప్పుడు హాయిగా ఉండనందుకు అనుభవిస్తున్నాం ....... కలెక్టర్ గారింట్లో పెండ్లి.... అంటూ గొణుకుతూ రామచంద్రానికి చికాకు కలిగిస్తాడు.

ఏదైనా అనర్థం జరిగినపుడు మనిషి ప్రవర్తన ఏలా ఉంటుందో తెలియచేస్తుంది ఈ కథ. అనుకోని, ఊహించని సంఘటన (బాధకరమైనది) జరిగినపుడు మనిషి గతాన్ని తవ్వుతూ, అలాచేస్తే ఇది సంభవించక పోవునని తలుస్తూ, ఊహిస్తూ తృప్తిపడాలని, బాధను మరచి పోవాలని ప్రయత్నిస్తుంటాడు. ఒక రకమైన అవస్థ. ఏం తోచదు.

మృత్యువును సమీపిస్తున్న రామచంద్రం రోదన, ఆతని దీనమైన ఆర్తనాదాలు వీరిని మరింత భయం కంపితుల్ని చేస్తాయి. చెల్లెలి భర్త తన ఎదురుగా మృత్యువుతో పోరాడుతుంటే ఏమీ చేయలేని నిస్స హాయ స్థితి.... స్పృహకోల్పోయిన రామచంద్రం శరీరం చల్లబడుతుంది. అందుకు తోడుగా అవధాని స్పృహకోల్పోతాడు. శవంలాగా పడిఉన్న బావమరిది. స్పృహకోల్పోయిన అల్లుడు....ఎంతటిదుస్థితి. భయం కరమైన అడివిలో ఒంటరిగా దిక్కుతోచక వెక్కి వెక్కి ఏడుస్తుంటాడు భూషణం. పరిస్థితులు మనిషి మనస్తత్వంపై ఎంత ప్రభావం చూపుతాయి. అతను ఎంతగా చలించి పోతాడో ఎంతగా (కుంగిపోతాడో) వాస్తవంగా వర్ణించబడింది.

స్పృహలోకి వచ్చిన అవధాని దిక్కుతోచక విచక్షణా రహితంగా మామయ్యా పారిపోదాం అంటాడు. ఎంత స్వార్థం. చావు బతుకుల్లోనున్న మనిషినిసైతం విడిచి వెళదామనుకుంటారు. కాని ఎక్కడికి పారిపోగలరు నడవని కారు, అడవి, రాత్రి సమయం, చిరుతపులి భయం.

మొదట నిశ్శబ్దమైన అడవిలో గజ్జెలశబ్దం వీరిని మరింతగా భయభ్రాంతులను చేస్తుంది. కాని అతనిని మనిషిగా గుర్తించి పాములవాడని తెలుసుకొని సహాయం అర్థించి రామచంద్రాన్ని ప్రాణాపాయ స్థితి నుండి కాపాడుకొంటారు.

గర్భవతి అయిన సూరీడు ఒక మనిషిని రక్షించ డానికిగాను పామువిషం హరించే వేరుకోసం అర్థరాత్రి ఒంటరిగా అడవిలోకి వెళ్ళి తన బావమరిదిని బ్రతి కించిందనే నిజాన్ని మరచి కృతఘ్నుడైన నాగ భూషణం, అర్థరాత్రి సూరీడు చెంతచేరి, డబ్బులు చూపించి కోరిక తీర్చమంటాడు.

ఎంత పతనం. దుర్మార్గుడైన భర్తను వదిలినందుకు గాను సూరీడును నీతిమాలినదన్న భూషణంకు తన కృత్యం ఎంత నీచమైయ్యిందో తెలియదా ? పైగా తమను రక్షించి ఆశ్రయమిచ్చిన వార్ని, ఒక స్త్రీ శీలాన్ని డబ్బుతో వెలకట్టాలనుకోవడం ఎలాంటి లక్షణమో తెలియదా...! తప్పు లెన్నువారు తమ తప్పులెరుగరన్న వేమన పద్యంలా తను చేస్తే పని నీచంగా, నీతిమాలిన పనిగా తోచలేదు. పైగా ప్రతిదీ డబ్బుతో కొనగలమనుకొనే ధనవంతుల మనస్తత్వ చిత్రీకరణల దర్పణం ఈ కథ.

తన తండ్రి ప్రాణాపాయస్థితిలో ఉన్నాడని, ఒంట రిగా ఉండడం వల్ల భయంవేస్తుందని తోడుగారమ్మని అర్థించిన సూరీడును తిరస్కరించి కలెక్టర్ గారి పెండ్లికి వెళతాడు. తమ ప్రాణాల్ని రక్షించిన వ్యక్తి కన్నా కలెక్టర్‌గారి పెండ్లి ప్రాముఖ్యమైనదిగా తోచింది కృతజ్ఞతగా కాకపోయినా మనిషి బాధ్యతగానయినా తోచలేదు.... పైగా భూషణం పాపం మనమేం చేయ గలం అని జాలిపడతాడు. భూషణం, కర్తవ్యంగా నిర్వహించవలసినది మానేసి జాలిపడి చేతులు దులుపు కొంటాడు. ఇది హృదయపూర్వక మయ్యింది కాదు. అంతరాత్మ నోరునొక్కి సంతృప్తిపరిచే సాధనం మనిషి, మనస్సుకన్నా, జీవిత విలువలకన్నా, మాన వతకన్నా బాహ్యాడంబరాలకు, అధికార ధనాలకు ఏ విధంగా తలవంచుతాడో తెలియచేస్తుంది ఈ పాత్ర.

**అవధాని :-**

మొదటగా కథ నల్లజర్ల రోడ్డుపై చంద్రుడు భయంకరంగా ఉదయించాడు. చంద్రుడు, వెన్నెల అందంగానే కాదు భయంకరంగాను ఉంటాయి అనే వాక్యంతో మొదలవుతుంది. మనిషి స్థితిగతుల్ని, అప్పటి పరిసరాల్ని అనుసరించి అందుకు అనుగుణంగా ప్రకృతి ఆనందంగానో, దుఃఖపూరితంగానో తోస్తుంది. దుఃఖితుడికి వర్షం ఆకాశంకార్చే కన్నీరుగాను, ఆనందించేవాడికి ఆకాశం ఆనందపు నవ్వులాగాను తోస్తుంది. ఈ ప్రపంచం, ప్రకృతి మనిషిని ప్రతి బింబించడమే కాక అతనికి ఆనందాన్ని సానుభూతిని, స్వాంతనను చేకూర్చుతాయి

తన మిత్రులకు తోటలో ఇచ్చిన తేనీటివిందు అనంతరం అవధాని తన చిన్ననాటి భయంకర సంఘటనను వారికి తెలియ చేస్తుంటారు

మీ కథచెప్పండి అన్న నారాయణవంక నిరసనగా కోపంగా చూస్తూ "కథా" అంటాడు. నారాయణ తన పొరపాటు సవరించుకొని అదే మీ చిన్ననాటి సంఘటన అనగానే చెప్పడం మొదలెడతాడు అవధాని.

ఒకరి జీవితానుభవాల్ని అర్థం చేసుకొని అవసరమైనవి గ్రహించి స్వీకరించాలనే, ఆసక్తి చాలా మందికి ఉండదు. పైగా తమకు సంభవించిన సంఘటనల్ని ఇతరులు తేలికగా తీసుకొంటే భరించలేని మనుష్యులు, తోటి మనుష్యులూ అలాంటివారేననే నిజం గ్రహించరు.

కారు ప్రయాణంలో నాగ భూషణం, రామచంద్రుల సంభాషణవింటూ తనను అడిగినవాటికి సమాధానాలిస్తూ ఆసక్తిగా పరిసరాల్ని గమనిస్తూంటాడు 18 ఏండ్లవాడైన అవధాని. సహజంగా వాళ్ళ మన స్తత్వానికి అనుగుణంగా పిల్లలు తమ చిన్నతనంలో సంభవించిన సంఘటనలను, వాటి ఫలితాలను గమనించడం వల్ల అవి వాళ్ళ ఆలోచనా కోణాల్ని పథాల్ని నిర్ధారిస్తాయి. అంటే గతం మనిషి జీవితాన్ని శాసిస్తుంది.

అవధాని తను చదివిన కథలను, బందిపోటు దొంగలవి, దెయ్యాలవి మొదలైన కథల్లోని సంఘటనల్ని గూర్చి అడవిలో తిరుగాడే చిరుతపులి గూర్చి ఆలోచిస్తూ వాళ్ళ మామయ్యను సందర్భంలేకుండా "ఈ అడవిలో నేనా, చిరుపపులి ఉంది" అని ప్రశ్నించి కంగారు పెట్టేస్తాడు. పిల్లలు ప్రశ్నించే విధానం వారు చదివే పుస్తకాల ప్రభావం వారి మనస్థితిపై ఎంతగా ఉంటుందో అవి వారి ఆలోచనా రీతుల్ని ఎలా అమరుస్తాయొ, అవధాని పాత్రలో చక్కగా పొందు పరచాడు.

తను చదివిన కథలలోని సంఘటనలకు, తన ఊహనుజోడించి ఇలా ఇలా ఉంటుందేమోనని చూట్టూ పరిశీలిస్తుంటాడు. చిరుతపులి పైకి దూకి పొదల్లోకి లాక్కువెళ్లి, ఏ అవయవానికది తినేస్తుందేమో. ఆకుల మధ్యలోనుండి జారిన వెన్నెల వందల కొలది కట్ల పాములు కొండచిలువలూ పాకుతున్నట్టుగా ఉంటి. ఈ విధంగా ఆలోచించడం వల్ల కలిగిన భయంతో ...మామియ్యా మంచినీళ్ళు అని అడుగుతాడు..."ఈ అడవిలో మంచినీళ్ళెక్కడ దొరుకుతాయి ? ఇదేం మీ ఇల్లనుకొన్నావా ? అని విసుక్కొంటాడు భూషణం.

నాగభూషణం కోపగించుకోవటం వల్ల, భయంకలిగించే ఆలోచనల వలన, దాహం వేయడం వలన.... అవధానికి వాళ్ళఅమ్మ, ఇల్లు అన్నీ జ్ఞాపకంవస్తాయి. రాబోయిన ఏడుపును బలవంతాన ఆపుకొంటాడు. నాగభూషణం తేరుకొని అవధానిని ప్రేమగా పలకరిస్తాడు,

పాము కాటువల్ల రామచంద్రం స్పృహ కోల్పోయేపుడు చేసిన ప్రేలాపనలను, మృత్యువును సమీపించే అతని స్థితిని చూసిన అవధానికి కాళ్ళుచేతులు ఆడవు. ఎంతగానో ఏడవాలనుకొన్నా ఏడుపురాదు. పారిపోవాలనుంది. కాని ఎక్కడికి పోనూ... ? ఎలా ...పోను ? ఈ అడవిలో ఇలా ఆలోచిస్తుండగా స్పృహకోల్పోయి అతను శవంలాగా పడిఉన్న అతన్ని చూడడంవలన నిస్సహాయతచేత తాను ఎలాగు చనిపోతాననుకొంటాడు. ఆ ఊహవలన కలిగిన భయం వల్ల కొయ్యబారిపోయిన అవధాని...అదే సమయంలో దూరంగా హఠాత్తుగా రేగినమంటను చూడగానే బలహీనమైన మనస్థితివల్ల ఒక్కసారిగా "బాబోయ్‌దెయ్యం" అని అరచి స్పృహకోల్పోతాడు.

స్పృహరాగానే ఏడుస్తున్న భూషణాన్ని చూచి మామయ్యా పారిపోదాం అంటాడు. కాని ఎలా అడవి ఇంతలో రామచంద్రం శరీరం వంకరలు తిరుగుతుంది విపరీతమైన బాధచేత ........ నిశ్శబ్దమైన అడవిలో

ఒక్కసారిగా మువ్వల చప్పుడు వినిపించడం వల్ల చల్లబడ్డ రామచంద్రం శరీరం తగలడం వల్ల పట్టలేని భయంతో భూషణాన్ని కౌగిలించుకొంటాడు. ఆ తరువాత అతన్ని మనిషిగా గుర్తిస్తారు.

సిద్ధయ్య, అతడి కూతురు సూరీడు వల్ల ప్రాణాపాయాన్ని తప్పించుకొని అతని గుడిసెలో విశ్రమిస్తారు.

ఇష్టంలేక పోవడంవలన, దుర్మార్గుడవడం వల్ల మొగుడ్ని వదలివేసిందన్న విషయం విన్న భూషణం అవధానితో చూడు వీళ్ళకు నీతి, ధర్మం లేదు అంటాడు.

రాత్రి అస్పష్టంగా మాటలు వినబట్టం వలన మేల్కొన్న అవధాని, భూషణం సూరీడుతో తన కోరిక తీర్చమని, అందుకు ఆశగా డబ్బును చూపించడం చూసిన అవధానికి నీతి, ధర్మం లేనిది సూరీడా .. ? లేక భూషణమొ అర్థం కాదు. అంతు పట్టదు

ప్రాణభిక్ష పెట్టి, ఆతిథ్యమిచ్చి, ఆశ్రయమిచ్చి ఆదుకొన్న సిద్ధయ్య, సూరీడుల అవసరం కన్నా సూరీడు అభ్యర్థనకన్నా, ఒక గొప్పమనిషి ప్రాణాల కన్నా కలెక్టర్ గారింట్లోని పెండ్లి ఎంత ప్రాముఖ్యమైనదో అవధాని ఆలోచనలకందదు.

అవధాని చెప్పడం ముగించగానే సిద్ధయ్య చనిపోయాడేమో అంటాడు నారాయణ. అవధాని బాధగా బరువుగా మనకెలా తెలుస్తుంది.......... అంటూ గతంలోకి వెళ్ళి ఆలోచిస్తుంటాడు.

ఆ సంఘటన అతనిపై ఎంత ప్రభావం చూపించో ఈ వాక్యం వల్ల తెలుస్తుంది. కథ చదివిన మనకే ఇంత బాధగా తోస్తే అనుభవించిన అవధానికి, అన్యాయంచేయబడ్డ సిద్ధయ్య, సూరీడులకు మరెంత ఆవేదనను కలుగ చేస్తుందో ఆలోచించడం పాఠకునిగా మన కర్తవ్యం అనుకొంటాను.

సిద్ధయ్య:-

పాముల వాడు జమిందారు కోసం నల్లతాచు విషం తీయడానికివస్తూ అవధాని వాళ్ళను కలుసుకొంటాడు. ఒక మనిషి మృత్యుముఖంలో ఉండటం చూసి తన విద్యుక్త ధర్మంగా భావించి తన పని వదులుకొని వారిని అడవిలోనున్న తన పాకకు తీసుకు వెడతాడు. సమయానికి విషంహరించే వేరుముక్కలుండవు. నాగభూషణం ఎన్ని డబ్బులైన ఇస్తాను నా బావను రక్షించు అంటే డబ్బులు నేను తీసుకోను అంటాడు. సూరీడు సహాయం వల్ల రామచంద్రం బ్రతుకుతాడు

ప్రతిఫలంగా ఒక్కపైసా తీసుకోడు. పేదవాళ్ళ ఔన్నత్యం వారి సహకారగుణాన్ని ప్రేమతత్వాన్ని, ........ధనిక వర్గపు ఆడంబరాల్ని వారికి వీరికి గల అంతరాల్ని తెలుపుతుంది ఈ సంఘటన,

సూరీడు మగడు మంచివాడు కాకపోవటం వల్ల వదిలేసిందని ఇంకొకతన్ని పెండ్లిచేసుకుందని అతని వలన ఇపుడు గర్భవతి అని తెలియచేస్తాడు. మాటల సందర్భంలో మామూలుగా కాని మధ్యతరగతి, ధనిక వర్గపు ప్రజల్లో అలాంటి స్త్రీకి లభించే గౌరవం,మూర్ఖ ఆచారపు పట్టుదలలు మనకు తెలిసినవే ప్రకృతిలో జీవించే మనుష్యుల మనస్తత్వాలు కూడా అదే విధంగా స్వచ్ఛంగా ఉంటాయి. కాబోలు.

జమీందారు చెప్పిన పనిని వదలి, వారి ప్రాణాల్ని కాపాడి అతిథి సత్కారాలు జరిపి ఆశ్రయమిచ్చి ఆ చలిలో తాను బయట పడుకొంటాడు సిద్ధయ్య. ఉదయాన్నే లేచి వారిని అడవి దాటించడానికి తన కూతుర్ని తోడుగా పంపుతాడు. సహకార మనస్తత్వం కలవారు ఏ క్షణంలోనయినా తమ కర్తవ్య నిర్వహణను వదలరు. అందుకు నిదర్శనం సిద్ధయ్య అతని కూతురు సూరీడు.

సూరీడు:-

సిద్ధయ్య కూతురు అర్ధరాత్రి పూట ఒక వ్యక్తి ప్రాణరక్షణ కోసం చిమ్మ చీకటిలో, భయంక

మైన అడవిలో గర్భిణి స్త్రీ అయ్యుండి 2,3 గజాలు పరుగెత్తుకొని వెళ్ళి పొదల్ని, డొంకల్ని ముళ్ళ కుప్పల్ని దాటుకొని ప్రమాదకరమైన పాముపుట్టల పైన పెరిగిన మొక్కల్ని తీసుకువస్తుంది సూరీడు.

వేరు అరగతీసి రామచంద్రానికి త్రాగించి అతని శరీరాన్ని మర్దించి వేడిపాలు త్రాగిస్తుంది. అవధాని భూషణం లకు జామపళ్ళు పాలు ఇస్తుంది.

తనను కోరిక తీర్చమని అడిగిన భూషణం అంత నైచ్యానికి దిగజారినా అల్లరిపెట్టక నిందించక నేనలాంటి దాన్ని కాను అంటుంది.

తన తండ్రి పాముకాటుకు గురిఅయి ప్రమాద స్థితిలో ఉన్నాడని, ఒంటరినవడం వల్ల భయంగా ఉంది తోడురమ్మన్నా...... చేసిన మేలు మరచి రాముని నిరాకరించినా, డబ్బులు ఇవ్వకపోయినా ఏమి అనదు సూరీడు.

స్త్రీ మనస్తత్వానికి ఆ హృదయం లోని వాత్సల్యాన్ని ఆదరణను, ఆదుర్దాను సూరీడు పాత్ర వ్యక్తపరుస్తుంది. ఆమెలోని క్షమాగుణం, సంస్కార ఔన్నత్యానికి పేదతనం, నిరక్షరాస్యత అడ్డురాలేదు. ఇదే పాత్ర సమాజంలోని దుర్మార్గపు పురుషులవల్ల కలిగే అవమానాలకు, అన్యాయాలకు అద్దంపడుతుంది

వాళ్ళు నిరాకరించరను కొన్న సూరీడు అనుకోని అనుభవం ఎదురవడం వల్ల, ఇంత కృతఘ్నులు ఉంటారని ఊహించక పోవడం వలన, డబ్బు మనిషిని ఎంత దిగజార్చుతుందో ప్రత్యక్షంగా చూస్తూ, తండ్రి బాధను, తన ఒంటరి తనాన్ని, నిస్సహాయతను తలపోస్తూ వెళ్ళిపోయిన బస్సు రేపిన దుమ్ములో నిస్సహాయంగా, నిర్వేదంగా, శిలలా నిలిచి ఉంటుంది. ఈ చిత్రీకరణ మనముందు జరుగుతున్నట్లుగా తోస్తూ మన అంతరాల్ని తొలిచి అట్టడుగున దాగిఉన్న మానవత్వాన్ని వెకిలిలాగా ఆలోచింప చేస్తుంది.

ముగింపు:-

కథ చాలా చిన్నదే కాని ప్రపంచపు రీతుల్ని, అందులో మనుష్యుల వ్యక్తిత్వాన్ని, మనస్తత్వాల్ని స్వార్థాల్ని, త్యాగల్ని, ప్రతిబింబిస్తుంది.

నాగభూషణం, రామచంద్రం ధనికవర్గ మనస్తత్వాలకు ప్రతీకలు. వీరు స్వార్థపరులు, కృతఘ్నులు, తమ గౌరవాలకోసం జీవిద విలువల్ని, మానవతను వదలుకోడానికి వెనుదీయరు.

సిద్ధయ్య సూరీడు మూర్తీభవించిన సంస్కారానికి మానవత్వానికి ప్రతీకలు. డబ్బుకు వీరు విలువనివ్వరు. మనిషి జీవితం విలువ తెలుసు. బాహ్యాడంబరాలు లేవు వీరిని మన సమాజం అనాగరికులు దరిద్రులు అంటుంది కాని వీరు గొప్ప నాగరికులు. వీరికిహృదయదారిద్ర్యం లేదు. సహజత్వం, స్వచ్ఛత వీళ్ళసొంతం అర్థంకాని, లేని ఆచారాలతో తమను బంధించుకోరు.

అవధాని పసి మనస్తత్వానికి ప్రతీక. ఏది ఎందుకు జరుగుతుందో తెలుసుకోవాలనే కుతూహలంతో, ఇలా జరుగుతుందేమోననే ఊహాలతో సతమతవుతుంటాడు. గారాబపు పెంపకంతో సంపూర్ణజ్ఞానం అలవడదనే నిజాన్ని తెలుపుతులది. ఈ పాత్ర జరుగుతున్న సంఘటనలలో ఏది న్యాయమొ, ఏది అన్యాయమొ అంచనా వేయలేనివాడు. అవధాని తన బాల్యంలోని సంమటన నేటివరకు గుర్తుంది అంటే ఆతడు అపుడు ఎంత వేదనకు గురి అయ్యాడో. ఆ సంఘటన అతనిపై ఎంత ప్రభావం చూపిందో మనకు తెలుస్తుంది.

మిథ్యాగౌరవాలకోసం, అధికారాలకోసం ప్రాకులాడుతూ, మనయ్యలు వ్యక్తిత్వాల్ని, జీవిత విలువల్ని ఏ విధంగా చేజార్చుకుంటారో చక్కగా తెలియచేయబడింది. కర్తవ్యాన్ని విస్మరించి జాలిపడట ఎంత అసహ్యకరమైనది. ఏహ్యమైనది మరొకపని ఉండదు. జాలి, సానుభూతి అనే పదాలకు కొన్ని సందర్భాలలో అర్థం విలువ ఉండవు. జాలిపడటం వలన, సానుభూతి కురిపించడం వలన పరిస్థితులలో ఏ మార్పురాదు. చేయగలిగిన సహాయం సాధ్యమైనంత వరకు ఓ మనిషిగా బాధ్యతగా చేయాలి.

మనం మన మనస్తత్వాల్ని ఈ ప్రపంచంలో చూసుకోగలిగితే మార్చుకోగలిగితే.... రచయిత ఆశించిన ఫలితం చేకూరినట్లే.

హన్మకొండ.
వరంగల్.—506010

# శత్రువు

మూలం : హీరానంద్ సచ్చిదానంద్ వాత్స్యాయన్ "అజ్ఞేయ'

అనువాదం : డా॥ మాధవరావు రేగులపాటి

ఒకరోజు రాత్రి కలలో జ్ఞాన్‌కు భగవంతుడు దర్శనమిచ్చి "హేజ్ఞాన్ ! నేను నిన్ను నాయొక్క ప్రతినిధిగా ప్రపంచానికి పంపించాను. ఈప్రపంచాన్ని పునః ఉద్ధరించు." అని చెప్పినాడు.

జ్ఞాన్‌మేల్కాంచినాడు. అతడు ప్రపంచమును చూడగా అది అంధకార బంధురముగా కన్పించినది. మానవులంతా పదభ్రష్టులై నిరాశవైపు ఉరకలెత్తు చున్నట్లు తోచింది.

అతడు భగవంతుని ప్రతినిధి. మానవులను సరియైన మార్గములో పెట్టవలసి యున్నది. చీకటినుండి వారిని బయటకు రప్పించవలసి యున్నదికావున వారికి నాయకుడై చీకటితో యుద్ధము చేయవలసియున్నది.

అతడు చౌరాస్తా వైపువెళ్ళి అక్కడ నిల్చుండి అందరికి వినబడునట్లు బిగ్గరగా ఇట్లు చెప్పినాడు. "నేను భగవంతుని ప్రతినిధిని. అవతారమూర్తిని మిమ్ముల నుద్ధరించు సందేశము గ్రహించండి, నామాట వినండి."

కాని, ఎవరు అతని మాట వినలేదు. కొందరు అతని మాటలు విని నవ్వినారు. కొందరు అతనినిపిచ్చివాడని విశ్వసించినారు. అతడు నాస్తికుడని భావించినారు. అతడు విధర్మియని మరికొందరు అపహసించినారు. పిల్లలు అతనిని రాళ్ళతో కొట్టికొట్టి విసిగించ మొదలు పెట్టినారు.

సమీపమునుండి ఎక్కడో దాగియున్న ఒక అనాథ స్త్రీమూర్తియొక్క ఆక్రందన హృదయ విదారకమై అతని మనోమందిర ద్వారాలను తెరచుకొని ప్రవేశించింది. అతడు వెదకగా కొంతదూరములో ఒకామె పడియున్నది. ఆమె దగ్గర ఒక శిశువు కూడ అచేతనావస్థలో పడిఉన్నాడు. ఆ శిశువు అలసిపోయాడో లేదా మరణించాడో అర్థంకాలేదు. ఎందుచేతనంటే, అతని శరీరావయములతో దేనిలోకూడ చలనములేదు.

"అక్కా ! నీ వెందుకు ఏడుస్తున్నావు." అని జ్ఞాన్ ఆమెను అడిగినాడు.

"నేను వర్ణాంతర వివాహము చేసుకున్నాను. ప్రజలకు ఈ విషయము తెలియగానే వారు నా భర్తను చంపివేసినారు. నన్ను కులమునుండి వెలివేసినారు. నాకుమారుడు ఆకలితో చనిపోయేస్థితిలో పడి ఉన్నాడు." అని ఆమె విలవిల ఏడ్చింది.

జ్ఞాన్ సంకల్పము బలవత్తరమైంది. "నీవు నావెంటరా. నేను నిన్ను రక్షిస్తాను," అని జ్ఞాన్ ఆమెను తన వెంట తీసుకొని వెళ్ళిపోయాడు.

జ్ఞాన్ ధర్మవిరుద్ధమైన ప్రచారాన్ని ఇలా ఆరంభించాడు. "ధర్మము అనవసరమైన కట్టుబాటు. పరమాత్ముడు ఒక్కడే. అతడు ధర్మాతీతుడు. ధర్మము మనలను ఒక నిర్ణీత సీమలో బంధించి ఉంచును. పరమాత్ముని నుండి అదిమనలను వేరు చేయును. అందుకే ధర్మము మన ప్రధానశత్రువు."

జ్ఞాన్ వర్ణాంతర వివాహము చేసుకొన్న స్త్రీతో కలసి ఉంటున్నాడు, కావున అతడు ధర్మచ్యుతుడు. అనిభావించిన లోకులు జ్ఞాన్‌ను సమాజమునుండి వెలివేసి నానాబాధలు పెట్టసాగినారు.

ధర్మముతో యుద్ధము సాగించుటకు ముందు సమాజంతో యుద్ధము చేయవలసి యున్నది. ఎంత వరకు సమాజం పై విజయాన్ని సాధించలేమో అంత వరకు ధర్మం పై విజయాన్ని సాధించలేము. ఇది జ్ఞాన్ నిశ్చయము.

"ఓ ధర్మధ్వజము ధరించిన పురోహిత పుత్రులారా! ఆడంబరముగా ధర్మ చిహ్నాలను ధరించిన మానవ మాత్రులారా! స్వాములారా! సన్యాసులారా! మీరంతా ఎవరు? మా జీవిత విధానాన్ని బంధించే అధికారం మీకెవరిచ్చారు.? మేము స్వతంత్ర సమాజాన్ని నిర్మించాలని భావిస్తున్నాము. అప్పుడే మాకు గతి; ప్రగతి" అని ప్రచారాన్ని ఉమ్మరంగ మెదలెట్టాడు.

అప్పుడు ప్రభుత్వ పాలనాధి కారులు అతనిని బంధించి కటకటాల వెనక వేశారు. దానికి కారణము అతడు రెండు వర్గాల మధ్యన విరోధాన్ని నాటి, పెంచుతున్నాడని, ముప్పిరిగావగ్గాలును ముడివేస్తున్నాడని భావించడమే.

జైలునుండి బయటకు వచ్చిన నాటినుండి అతని మనస్సులో విదేశీ ప్రభుత్వ పాలనకు విరుద్ధమైన భావన జాగృతమైంది, మనలోని సమస్త విషమతలకు కారణము పరాయిపాలనము విదేశీయులు ఈ విషమ పరిస్థితుల నుండి లాభాన్ని పొందుచున్నారు. మనము పరప్రభుత్వపాలన నుండి విముక్తిని సాధింపవలసి యున్నది. అప్పుడు సమాజాన్ని ఎదిరించాలి. అప్పుడు ....................................

తర్వాత విదేశీ ప్రభుత్వమునకు విరుద్ధముగా యుద్ధము సాగించాడానికి అన్ని విధాల సన్నద్ధము చేయ సాగాడు. ఒకరోజు ఒక విదేశీయుడు అతని వద్దకు వచ్చాడు. అతడు చిరిగిన. మాసిన నల్లని గుడ్డలు ధరించాడు. అతని ముఖముమీద నల్లని గీరలు ఉన్నవి. కన్నుల్లో బరువైన బాధఇమిడి ఉన్నది. అతడు జ్ఞాన్‌తో ఇలా అన్నాడు. నాకు కొంత పని చూపించు, నా కొరకు సరిపోయే ఆహారాన్ని సంపాదించుకునే ఉపాదిని కల్పించు. నేను విదేశీయుడను. మీ దేశములో నేను ఆకలితో చస్తున్నాను. ఏదైనా పని చూపించు. చేస్తాను. నన్ను పరీక్షించు. నా దగ్గర తినడానికి పట్టెడు మెతుకులు లేవు. పిడికెడు బియ్యం లేవు.

నా పరిస్థితి నీ కంటే బాగా లేదు. నేనూ ఆకలితో చస్తున్నాను." అంటూ జ్ఞాన్ విచారంగా వీక్షించాడు.

ఆ విదేశీయుడు అతని మాటలు విని ద్రవించి పోయాడు. "నాయనా! మంచిది. నీ దుఃఖమే నా దుఃఖము. నన్ను నీ సోదరునిగా భావించు. పరస్పర సహకార సానుభూతుల వల్ల మనము పైకి రావచ్చు. మరణించే ప్రసక్తి లేదు. పరమాత్ముడు నిన్ను రక్షించుగాక. నీ కొరకు నేను కొంత మేలు చేయగలను." అంటూ జ్ఞాన్‌కో స్నేహాన్ని ఆశించారు.

"కడుపునిండి నప్పుడే "దేశీవిదేశీ"లన్న ప్రశ్న జనిస్తుంది. అందుచేతనే ఆకలి అన్నిటి కంటే పెద్ద శత్రువు. కావున ఆకలితో యుద్ధము చెయవలసి యున్నది ఆకలిని జయించాలి. అందుకే మన మిరువురము కలిసి ఆలోచిద్దాము. అని జ్ఞాన్ అన్నాడు

అప్పుడుజ్ఞాన్ 'ఆకలి శత్రు దళము' అన్న పేరుతో ఒక సైన్యాన్ని తయారుచేయడానికి సంకల్పించాడు. ధనవంతులను దోచుకోవాలి. అందరికి సమానంగా పంచాలి. ఆర్థులకు రొట్టెలివ్వాలి అన్నార్తులకు అన్నం పెట్టాలి మొదలైనవి. ఆ దళముయొక్క ఉద్దేశ్యాలు ధనవంతులకు ఆ దళముయొక్క ఆచూకి తెలియగానే వారు గుప్తచరులను పంపించి ఆ దళముయొక్క

నాయకున్ని పట్టితెచ్చి ఎత్తైన కొండమీద ఉన్న చెర శాలలో బంధించారు. అతనిని కష్టపెట్టే ఉద్దేశ్యంతో ప్రతిరోజు ఒక పిడికెడు శనగలు ఒక గుక్కెడు నీళ్ళు ఇవ్వసాగారు.

రోజు రోజుకు అతని మనస్సు దుఃఖముతో నిండి పోయింది. జీవితము అతనికి బరువుగా తోచింది. "భగవంతుని ప్రతినిధిని. అయినా కడుపునిండ కబళాన్ని పొందలేనివాన్ని. అయితే నా జీవితం వ్యర్థం నిరర్థకం ." అని వాపోయాడు. జ్ఞాన్.

జ్ఞాన్ ఒకరోజు ఆ కోటగోడ ఎక్కి చూసాడు. బయట కందకములో నీరు నిండ ఉంది నీటిని చూడగానే అందులో దూకి ప్రాణత్యాగము చేయాలని పించింది. పరమాత్మని చేరి అయ్యా ఈ భారమునుండి నన్ను రక్షించు. అని వేడుకోవాలనిపించింది. "నేను ప్రతినిధిని సరే! కాని ఈ ప్రపంచంలో నాకు స్థానము లేదు." అన్న భావం తలెత్తింది.

అతడు నిశ్చలంగా కందకములోని నీటిని చూడ సాగాడు. అందులో దూకడానికి తయారయ్యాడో లేదో నీటిలో అతని ప్రతిబింబం కనిపించింది. "నీకు నీవే శత్రువు. నాతో నీవు యుద్ధము చేయుము." అంటూ అనీడమహత్తర సందేశాన్ని అందించింది.

ఆ సందేశాన్ని వినిజ్ఞాన్ అలాగే ఆగిపోయాడు. మెల్లమెల్లగా గోడ మీది నుండి క్రిందికి దిగివచ్చాడు. ఆ కోటలో తిరుగ నారంభించారు.

వ్యక్తి నిరంతరము సులభతరము వైపు పరుగెత్తడమే జీవితము యొక్క ప్రత్యేకమైన మరియు ప్రధానమైన మానవుని కష్టము, అని అతను భావించసాగాడు.



# శ్రీ బాలచంద్ర ఆప్టే

దక్షిణ భారత హిందీ ప్రచారసభలో వివిధ పదవులు నిర్వహించినారు.

జననము : **28-7-1907**

నిర్యాణము : **10-4-1984**

వీరి ఆత్మకు శాశ్వతశాంతి లభించుగాత!

# రఘునాథ విలాసం-రస పరిశీలనం

— శ్రీమతి మన్నేరు వసుంధర

'రఘునాథవిలాసం' అనే చారిత్రకనవల వేంకట పతి రాయలు, శ్రీరంగరాయలు, రామదేవరాయలు అనే ముగ్గురు విజయనగర చక్రవర్తుల జీవితకాలానికి సంబంధించినది. ఈ చారిత్రక నవలా రచయిత శ్రీ ఎన్. ఎస్. వి. సోమయాజులు. ఈ చారిత్రక నవల లోని కథకు విస్తృతి ఉన్నట్లు స్థూలంగా కనిపిస్తు ది.

'రఘునాథవిలాసం' అనగానే ఏదో శృంగార కథా కల్పనతో విరచితమయిన నవల అని మొదట స్ఫురి స్తుంది. తంజావూరు రాజయిన రఘునాథనాయకుడు ప్రాధాన్యం వహించినట్లు ఉండే ఈ ఊహ మరింత ప్రబలమై విస్తరిస్తుంది. ఈ రఘునాథుని కాలంలోనే చేమకూర వెంకటకవి అర్జునుని శృంగారకథలను స్వీకరించి విజయవిలాసమనే ఉత్తమజాతి శృంగార కావ్యాన్ని చెప్పి ఈ రఘునాథునికే అంకితమిచ్చాడు. అందువల్ల రచయిత వేంకటకవి విజయుడితో రఘు నాథునికి సామ్యాన్ని కల్పించి అతడు కొంతమంది విలాసవతులను మోహించి వివాహం చేసుకోవటం కథావస్తువుగా స్వీకరించి ఉంటారని ఊహించవచ్చు విలాసశబ్దం శృంగారలీల అనే అర్థంతో విశేష ప్రాచుర్యం వహించటం కూడ ఇందుకు తోడ్పడు తుంది. అయితే ఈ 'రఘునాథవిలాసం' సమాస శబ్దంలోని విలాసానికి వీరక్రీడ అనే అర్థాన్ని రచయిత ఉద్దేశించి ప్రయోగించారు. విజయాన్ని లక్ష్మిగా [గా] భావించి వ్యవహరించటం ఉన్నది కనుక యుద్ధవీరమైనా ఈ శృంగార వాసనఉన్న శబ్దాన్ని ప్రయోగించడంలో సామంజస్యం లేకపోలేదని సరి పెట్టుకోవచ్చు.

అలంకార శాస్త్రజ్ఞులు వీర, శృంగార రసాలు అంగి రసాలని, అన్యరసాలు అంగ రసాలని నిర్ణయం చేశారు. ఈ రెండిటిలో ఏదో ఒక రసం ప్రాధాన్యం వహించకపోతే ఏ కథా రక్తి కట్టదు. అందువల్లనే ప్రపంచంలోని ఉత్తమ రచయితలందరూ విఖ్యాతి గన్న తమ రచనలలో ఈ రెండు రసాలను లేక ఇందులో ఏ ఒక్కరసాన్నో ప్రధానరసంగా స్వీక రించారు. ఇందులోఒక్క రసాన్ని ప్రధానం చేసుకొన్న పుడు రెండవరసాన్ని ముఖ్యమైన అంగరసంగా స్వీక రించటం కనిపిస్తుంది. 'రఘునాథవిలాసం' రచయిత విపుల కథాగమనాన్ని గుర్తించి వీరరసాన్ని ముఖ్య రసంగా స్వీకరించి శృంగార రసాన్ని ప్రధానమైన అంగరసంగా గ్రహించారు.

విజయనగర చక్రవర్తి అయిన వేంకటపతిరాయల మీద విదేశీయులైన తురుష్కులు దండయాత్రకు వచ్చినపుడు సామంతులయిన మధుర, తుండీరపతులు కప్పం చెల్లించటం మాని స్వాతంత్ర్యాన్ని ప్రకటించి సైన్యాలతో పైబడినపుడు రఘునాథుడు చక్రవర్తికి చేసిన సహాయం వల్ల వాళ్ళు పరాజితులైనారు. గొబ్బూరు దుర్గాధిపతి అయిన జగ్గరాజు మోసంతో

వేలూరు దుర్గాన్ని ఆక్రమించి చక్రవర్తి శ్రీరంగ రాయలను బందీచేసి, అతని కుటుంబ సర్వనాశనానికి ఆత్మహత్యకు కారకుడైనాడు దేవీకోట యుద్ధంలో తంజాపుర రఘునాథనాయకుడు దేశోపద్రవ కారకుడైన చోళకుడనే చోరనాయకుడ్ని హతమార్చాడు. రఘునాధుడే నేపాళయుద్ధంలో దుష్టులైన బుడతకీచులను పూర్తిగా నాశనం చేసి నేపాళరాజును రాజ్య ప్రతిష్ఠాపన చేశాడు. తోపూరు యుద్ధంలో యాచమ నాయకుని సహాయంతో రఘునాధుడు క్రూరనిరంకుశుడైన జగ్గరాజును రూపుమాపి. శ్రీరంగరాయల పుత్రుడైన రామదేవరాయలను సమ్రాట్టుగా అభిషేకించాడు. ఈ చారిత్రకాంశాలతో విస్తరించిన చరిత్ర అంతా రఘునాథవిలాసానికి కథావస్తువు. ఇందులో వీరరసానికి తప్పు రెండవ అంగిరసమయిన శృంగారానికి తావులేదు. అందువల్లనే తన కథకు రక్తిని పెంచుకోటం కోసం రచయిత తుండీరపతి కృష్ణప్ప పుత్రిక కృష్ణకుమారికి రఘునాధుని రూప, గుణ విశేషాలను వినటం మూలంగా కనుకలిని కల్పించి దానిని క్రమంగా పెంచి శృంగార రస సంపాదనం చేశారు. అందువల్ల 'రఘునాథవిలాసం' నవలలో వీరరసం విశేష ప్రాచుర్యం వహించి. శృంగారరసం రెండవ స్థానాన్ని పొందింది.

—...—

రఘురాంనగర్
నాగారంపాలెం
గుంటూరు

# ఆధునిక దశావతారములు

—"సహజకవి"

## 1. మత్స్య

ఉ ఉన్నత సత్య ధర్మ నిగ మోక్తులు మంటను గల్పినేడు మే
మన్నదె వేదమంచు జగమందు వచించు నిశాచరాధిపుల్
మన్నన జెందుచుండిరి అమాయకులౌ మనుజాళిచేత నిం
కెన్నడు మీన రూపము ధరించెదు యాదగిరీశ మ్రొక్కెదన్

## 2 కూర్మ

ఉ ధర్మ ధరాధరంబు కడు తల్లడ మొంది మునుంగుచుండె దు
ష్కర్మ మహాంబురాశిని విశాల జగంబు కలంత నొందెడిన్
కూర్మమై ధరించి యునికుంఠిత దీక్ష సనాతనార్య స
ద్ధర్మము నిల్పి గావ గదె తద్దయు యాదగిరీశ మ్రొక్కెదన్,

# కవి–ఋషి

—విశ్వ

ప్రస్తుతము ప్రజలలో మున్నెన్నడు లేనంతగా నైతిక విలువలు కొఱవడుతున్నాయి. సామాన్య ప్రజానీకంలోనే కాదు. నైతిక విలువలు సమాజమునకు హితాన్ని బోధించే కవులలో రచయితలలో కూడ కొఱవడుట విచారింపదగిన విషయం.

'నానృషిః కురుతే కావ్య'మ్మని కవికుండ వలసిన లక్షణాలను ఒక విధంగా మన ప్రాచీనాలంకారికులు సమాజ హితాన్ని దృష్టిలో పెట్టుకొనియే చెప్పారు. వారు చెప్పిన పైవాక్యాన్ని వివేచించినతో అది సార్వకాలిక సత్యమని బుద్ధి కుశలురకు తోపకమానదు.

'ఋషి కాని వాడు కావ్య నిర్మాత కాజాలడు' అని అంటే కావ్యనిర్మాణమునకు ఋషియై యుండవలెననుట. ఋషియనగా కేవలం ముక్కుమూసికొని అడవులలో తపస్సు చేయువాడని సామాన్య ప్రజానీకములో నున్న అర్థంకాదు. మఱి ఎట్టివాడు ఋషి? అని ప్రశ్నించుకొన్నచో "ఋషయః సాక్షాత్కృత ధర్మాణః" అని సమాధానము అనగా లోక ధర్మముల సాక్షాత్కారము గలవారు ఋషులు.

వశిష్ఠాది మహర్షులు విశ్వ ధర్మముల సాక్షాత్కరింప జేసికొన్న మహానుభావులు. కావుననే వారు సాక్షాత్కరింప జేసికొన్న ధర్మములను మంత్ర రూపకముగా ప్రవచించారు. వేదములు ప్రభు సమ్మితములు కావున వారు సాక్షాత్కరింప జేసికొనిన విశ్వధర్మములు మంత్రరూపకముగానే ప్రవచించుటవలన నవియును ప్రభుసమ్మితములే. కాని వీరికి 'కవి' యను సంజ్ఞరాలేదు. కారణము వీరు తత్త్వద్రష్టలైనను కాంతా సమ్మితమగు కావ్యరూపమున చెప్పక పోవుటయే. పిండితార్థ మేమనగా కవి ఋషియై యుండును. కాని ఋషులందరు కవులు కాలేరు. దీనికి వశిష్ఠాది మహర్షులే ప్రబల నిదర్శనము.

సాహిత్య మీమాంసలోని ఈక్రింది శ్లోకం చూడండి.

"భూత పూర్వస్య మంత్రస్య దర్శనాదృషయో యథా
నవగుంపార్థయో స్తత్వద్దర్శనాత్కవయోఽభవన్"

ఋషులు కవులు తత్త్వద్రష్టలే. అయ్యును 'కవి' సంజ్ఞాపదమున కదనవుటర్హత మనోహరమగు వర్ణనా దృష్టిని కల్గియుండుటయే.

వాల్మీకి వ్యాసాదులు రామాయణభారతాదుల రచనకు పూర్వము ధర్మసాక్షాత్కారము గల ఋషులే. వారా సాక్షాత్కరింప జేసికొన్న ధర్మములను కాంతా సమ్మితమగు కావ్యరూపమున మనోహరముగా వర్ణించిన పిదపనే వారికి 'కవి' యను సంజ్ఞకలిగినది.

ఇక కవి శబ్దమును పరిశీలించుదాం,

"కబృ' ధాతావు, "వబయోంబేధః" అను ప్రామాణిక వచనము వలన, కవృ = వర్ణే; కవతే ఇతి కవిః = చాతుర్యముచేత వర్ణనచేయువాడు. కు = శబ్దే; కవతే ఇతి కవిః. కై = శబ్దే; కావతే ఇతి కవిః. ఈ విధముగ నిష్పన్నమైన కవి శబ్దము మనోహరమగు శబ్ద వ్యాపారముగల వానికి సమన్వయించును.

వేదములందు 'ఋషి' పదమునకు పర్యాయ పదముగా కవి శబ్దము ప్రయుక్తమైనది.

"ఆత్వా మంత్రాః కవి శస్తా వహన్తు'
(ఋ. X 144)
"సతో బంధమసతి అరవిందన్ హృది ప్రతీష్య కవయో మనీషా"
(ఋ. X 129)

పైన 'కవి' పదము కావ్యకర్తలనెడి అర్థంలోగాక మంత్రద్రష్టలు మంత్రకృత్తులైన ఋషుల (జ్ఞానము) పరంగానే యర్థము.

ఇంకా వేదములో పరమాత్మ వాచకముగా ప్రయుక్తమైన ఈ క్రింది ఋక్కు చూడండి.

'గణానాం త్వా గణపతి (గ్ం) హవామహే కవిం కవినాముపవశ్రవస్తమం' ఈశావాస్యోపనిషత్తులోను కవి పదము తొలుత పరబ్రహ్మ బోధకముగానే కన పడుతుంది.

కవిర్మనీషీ పరిభూః"

* * * *

భగవద్గీతలో సూక్ష్మార్థ వివేకముగల వారిని బోధించునదిగా కవి పదము ప్రయుక్తమైనది.

"మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః"
(X 37)

కవికి ఋషికి విశ్వశ్రేయస్సాధనేచ్ఛ సమానమే. "విశ్వశ్రేయః కావ్య"మ్మని శబ్ద శాసనులన్న మాట కవికుండవలసిన దృక్పథమును ఋషిత్వమును చాటు చున్నది. మఱియు నయ్యది శబ్ద శాసనుల ఋషిత్వ మునకు దర్పణము పట్టుచున్నదనవచ్చును.

ఋషియొక్క వర్ణనారూపమైన వాగ్వ్యాపారమే కావ్యము కావ్యము వ్రాసినట్టి ఋషియేకవి. "కావ్యం యశసే అర్థకృతే" అని మమ్మటుడన్నట్లు అఖిలా భ్యుదయములకు హేతువుకావ్యమే. విశ్వశ్రేయస్సాధన మని 'విశ్వశ్రేయః కావ్య'మ్మను దానికి లాక్షణిక మైన యర్థము. ఇది సారోప లక్షణకు సంబంధించినది.

కవి నిరవధిక దృక్పథము గలవాడు. "తన్నుదాటి మిన్నుదాటి మన్నుదాటి మాటలాడు వాడు. దేశకాలా వధుల నధిగమించినవాడు. ఆతడు విశ్వైక కుటుంబి

ఇంకా కవిగూర్చి వివరించుట యిట అప్రస్తుతము కాదనుకొంటాను.

కవికి సమాజానికి అవినాభావ సంబంధముంది. కవి అంటే తన వరకే కవిత్వము చెప్పు(కొను) వాడు కాడనుట సత్యము (అటువంటి కవులు లేక పోలేధను కోండి. అని వేరే విషయం) భరతుడు తన నాట్య శాస్త్రంలో కావ్యమునకు ముఖ్యప్రయోజనము వినోద మనియు చెప్పాడు.

"క్రీడనీయక మిచ్ఛామో దృశ్యం శ్రవ్యంచ యద్భవేత్" అనియు

మఱియు

"వేద విద్యేతి హాసానా మర్థానాం పరికల్పనం
వినోద కరణం లోకే నాట్యమే తద్భవిష్యతి"

వీనిని భరతుడు రూపకములగూర్చి చెప్పినను కావ్యములకు కూడా చక్కగా అన్వయిస్తాయి.

"ఇప్పుడు "విశ్వశ్రేయః కావ్య"మ్మను నన్నపా ర్యోక్తిని పై భరతముని భావాలతో సమన్వయము చేసికొంటే కావ్యప్రయోజనమునకు చక్కని నిర్వచ నము వస్తుంది. అదేమంటే భరతముని చెప్పినట్లు కావ్యప్రయోజనము వినోదమే. అది కేవలం వినోద మాత్రమే గాక విశ్వ ప్రజావళికి సంక్షేమ దాయకం కావాలి. ఉదాహరణకు మన భరత ఖండ పరిస్థితే చూద్దాం. భారతీయులు ఒకే రాజు పరిపాలన క్రింద యేకాలంలోను (ఒక బ్రిటిషువారి కాలంలోతప్ప) జీవింపలేదు. అంగ వంగ కళింగాది షోడశ మహాజన పదాల కాలం నుండి రెండు మూడు శతాబ్దుల క్రితము వఱకు భరత ఖండవాసులు వివిధ రాజుల పరిపా లనలో వివిధ దేశములలో నుండేవారు. అందులో ఉత్తర దక్షిణ దేశీయులకు భాషా వైషయికంగా నేమి

మైన వ్యక్తిగత జీవితానుభవంగా, వ్యక్తిగత తీపి అనుభవ అనుభూతిగా మారుతుంది

అప్పుడు వ్యక్తి రసజగత్తులోని రసజ్ఞతను కోల్పోయి రసికజగత్తులో రసికుడౌతాడు.

* * * *

లలితకళాజగత్తులో
కళా వ్యక్తులలో
సమిష్టి కళాసృష్టిలో

కళాకారులు సమిష్టిగా కళాకృతులను నిర్మిస్తుంటారు. ఆ సమిష్టినిర్మాణంలో కళావ్యక్తులు విభిన్న వ్యక్తిత్వాలతో సమీకరింపబడతారు. ఆ సమీకరణలో ఆత్మీయతలు పెరుగుతవి. ఆకర్షణలు అధిగమిస్తవి. వీటన్నిటి మధ్యా కళాప్రేరణ సన్నబడినప్పుడు అక్కడ అది వ్యక్తుల సమీకరణే ఔతుంది. అప్పుడు వ్యక్తిస్వభావంలోని గుణాలు ఎన్నో రెట్లుగా గుణించబడి పెల్లుబుకుతాయి. అందులోనుంచి పుట్టుకొస్తాయి; తీపి ఊహాలు, తీపిచేష్టలు, తీపి అనుభూతులు, తీపి అనుభవాలూ.

ఇవి ఆయావ్యక్తులమధ్య ఎలాజరుగుతాయి. అందుకు ఆయా కళలలోని ఏ అంశాలు తోడ్పాటునిస్తాయి అని ఆలోచిస్తే-

శిల్పచిత్రకళలలో Neude Model వ్రాసేటప్పుడు స్త్రీపురుష సమీకరణ జరుగుతుంది. పైగా అది ఏకాంతసమీకరణ. ఆ సమీకరణలో కళ నియతిగా ఉంటుంది. ఆ కళ, ఆ సమయంలో కాస్త ప్రక్కకు తప్పుకున్నప్పుడు అది వ్యక్తుల సమీకరణ ఔతుంది.

నాట్యకళ, అభినయకళ అన్నది, ఒక సమిష్టి యజ్ఞకృతువు. ఇందులో స్త్రీపురుషుల సమీకరణజరుగుతుంది. ఈసమీకరణలోని స్త్రీపురుషులు ఇరువురూ కళామూర్తులే. కళకుఉండవలసిన లక్షణాలన్ని ఈ ఉభయలలోనూ ఉంటాయి. అవి నిశ్చబ్దంగా ఉండక వీరిని ఎప్పుడూ ప్రేరేపిస్తుంటాయి. కళాపరిధిలో, ఆ ప్రేరణలుసాగితే. కళావ్యక్తిత్వము వ్యక్తిత్వాన్ని పొందుతుంది. అలాకాక ఆప్రేరణ వ్యక్తిగతమైనప్పుడు ఆ సమీకరణ స్త్రీపురుష సంధానయజ్ఞమే ఔతుంది. ఇందులో పాత్రలతాదాత్మ్యతా ఉంటుంది. ఆ పాత్రభావాలూ కాసోకూసో ఉంటాయి ఆ తాదాత్మ్యం కళ్లెము కళాకారుల చేతులలో ఉన్నంతవరకూ, కళావ్యక్తిత్వాలతో ఆ కళాకారులు ఉంటారు. ఆ కళ్లెంపట్టు కాస్తసడిపోతే, కళావ్యక్తిత్వంలో వ్యక్తిమాత్రమే తమ వ్యక్తిగతస్వభావాలతో వ్యక్తులగా మిగులుతారు.

సాహిత్యకళలో కళాకారుడు తన ఆదర్శసౌందర్య సృష్టిలో తనకాల్పనిక జగత్తులో ఓ సుందరిని సృష్టించుకుంటాడు. ఆ సౌందర్యములోని ఛాయ ఈ లోకంలో కనిపించినప్పుడు మనస్సు ఇచ్చేస్తాడు. అప్పుడు కళావ్యక్తి, వ్యక్తిగా ఔతాడు.

సంగీత కళాజగత్తులో, నాట్యకళలోవలె సమీకరణ ఉన్నది. ఈ కళలో గాత్రం గానంచేస్తూ ఉంటుంది. కళ్ళు గానకళకు సంబంధించిన సంకేతాలను వాద్యాలకూ అందజేస్తుంటాయి. అలానే వాద్యకళాకారులు తమ సంగీత సంకేతాలను కళ్లద్వారా తోడుగాత్రానికి గానీ, ప్రక్కవారికిగానీ అందజేస్తుంటారు.. ఈ కళ్ల భాషద్వారా భావాన్ని ఎలా సాంకేతపరచి చెప్పవచ్చో బాగా తెలిసిపోతుంది. దానిద్వారా తమ కళావ్యక్తిత్వంలో, వ్యక్తి చెప్పే భావాలను కూడా ఎలా చెప్పవచ్చో తెలిసిపోతుంది. దానితో గాన కళావ్యక్తిత్వంలోంచి వ్యక్తివిడిపోయి 'నయనభాషను' అనునయంగా చెప్పటం ప్రారంభిస్తే వ్యక్తులు కేవల వ్యక్తిత్వాలతో యుగళంతో మంద్రస్థాయిలో మాట్లాడుకుంటారు.

* * * *

కళలలోని ఈ విడివిడి అంశాలు కాకుండా సాధారణం అయిన మరికొన్ని అంశాలుకూడా ఉన్నాయి.

ఈ లలితకళలు అందమైనవి ఆనందమైనవి ఆకర్షణీయమైనవి. కనుక ఇవి మనిషిని ఇట్టే ఆకర్షించి

ద్రవీకరించి ఆకట్టుకొంటాయి. ఈ లక్షణం ప్రతికళ లోనూ ఉన్నది. ప్రతిమనిషి ఆకర్షింపబడి కళనూ కళాకారులనూ అభిమానిస్తాడు. కళాకారులు తమకళా వ్యక్తిత్వంలో ఉన్నంతవరకూ కళతో అనుబంధతను కలిగి ఉంటారు. అలాకాక, ఈ అభిమానం వ్యక్తి గతంలోనుంచి వచ్చినా, లేక వ్యక్తిత్వము అనుసంధా నము అయినా కళావ్యక్తిత్వంగల ఈ కళావ్యక్తులూ, ఈ కళాభిమానులూ, వ్యక్తులుగామారిపోయి వ్యక్తిగత ఇచ్ఛలను తీర్చుకునేవారవుతారు. అప్పుడు కళావ్యక్తి త్వంలో కళ ఉండదు. కళాస్థానం ప్రక్కకు తప్పు కొంటుంది.

అందుకు కారణం కళాకారులలోనూ, కళలలోను, కళాంశాలలోనూ కళాసమీకరణలలోనూ. కళాసమా రంభంలోనూ, కళా పదార్థం లోనూ, కళా స్వభావం లోనూ, కళాపుట్టుకలోనూఉన్న

రమణీయతా
ఆర్ద్రతా
ఆనందమూ
తాదాత్మ్యతా
అనుభూతీ
స్వాప్నికతా
కల్పనా

అన్నవి కారణం.

కనుక 'కళా-వ్యక్తి' కళాసృష్టిలో, కళాదృష్టిలో, కళావ్యక్తిత్వంలో ఒకటి అవుతున్నారు.

కళామనిషి. మధురమైన మనిషీ, అవుతున్నాడు కళావ్యక్తిత్వంలో.

కళావ్యక్తిత్వాన్ని కలిగిఉన్నంతవరకు ఈ కళాకారుడు మధురమైన మనిషి ఔతున్నాడు.

* * * *

'కళ-వ్యక్తిత్వం'లోని

'కళ-వ్యక్తి' అన్నవాటిల్లో వ్యక్తి నశిస్తాడు. కళ ఉంటుంది. వ్యక్తి నశింపుతోబాటు వ్యక్తిలోని అప స్వరాలు నసిస్తాయి. ఆ వ్యక్తి సృష్టించిన కళాఅందు లోని విశిష్టతలు నసించవు.

రసజగత్తులోని రసజ్ఞత; వ్యక్తిలోని రసికతను చూడదు. అతనినుండి జన్మనెత్తిన రసకృతిని చూస్తుంది అలాకాక రసజగత్తులో, వ్యక్తియొక్క రసికతనే రసజ్ఞత అన్నది చూచినపుడు అదికొంత వరకు ఆజ్ఞతే అవుతునది. రసస్పృష్టి కాని ఇద అశక్త జన్యతాదోషమూ ఔతుంది.

కళజగత్తులోని కళాకారుడూ ఒకవ్యక్తే కాబట్టీ, అతనిలోనూ వ్యక్తిస్వభావమూ ఉంటుంది. కళాస్వభా వమూ ఉంటుంది. వ్యక్తికి ఉండవలసిన రసికతా ఉంటుంది. కళకు ఉండవలసిన రసజ్ఞతా ఉంటుంది, కాకపోతే ఈ రెంటికీఉన్న శబ్దసామ్యంతో అవి కలిసి పోకుండా, అర్థసామ్యంతోనూ గుణసామ్యంతోనూ విడ విడిగా ఉండాలి.

కళాజగత్తులోని కళాకారునిలో కళాకృషి అధికమై దానిభారం అధికమైతే; కళాకారుడౌతాడు. అప్పుడు అతని కళాకృషిముందూ, కళాకృతులముందూ, కళా విలువలముందూ వ్యక్తిలోగల బలహీనతలు బలహీన పడిపోతవి. ఆలాకాక అతనిలో కళాకృషి సన్నగిల్లి వ్యక్తిభారం అధికమైతే 'కేవలం అందరిలా వ్యక్తిగానే మిగిలిపోతాడు.

మనుషులలో బలహీనతలు అన్నవి ఉంటాయి. కళాకారులూ మనుషులే. వారిలోనూ బలహీనతలు ఉంటాయి. పైగా వారిలోని కళాగ్ని, కళాతపనా, ప్రేరేపించే బలహీనతలు, వీటన్నిటినీ తట్టుకొని కళా

జగత్తులో సాగిపోవటం ఒక ఎత్తు. వాటితోబాటు వ్యక్తినిదాటి కళావ్యక్తిత్వంలో ఉండటం మరొకఎత్తు.

ఇన్ని సంఘర్షణల సంఘటనలను తట్టుకొని కళాజీవిగా స్ఫటికజీవితాన్ని గడపటం అంత తేలికైన పని కాదు. తలచుకుంటే కళాకారులకు, అది అంత కష్టమైన పనికాదు.

కళాకారుని నరనరాలలో కళజీర్ణమైనప్పుడూ, అతని ప్రతి ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో, కళాసృష్టి, కళాభావం, కళాలోచనల్లో కళాకాంతి ఉన్నప్పుడు, స్ఫటిక జీవితాన్ని సాధించటం ఏ మాత్రం కష్టమైన పని కానే కాదు కళాకారులకు.

హిల్‌కాలనీ
నాగార్జునసాగర్
నల్గొండ-జిల్లా. ఆం. ప్ర.

# ఆధునిక దశావతారములు

"సహజకవి"

## 4 నారసింహ

ఉ దేవుడు లేడు లేడని మదించి వచించు నిశాచరాధిపుల్
భూవలయాన భర్మకశిపుల్ జనియించి రనేకులెందరో
నీ వికనుగ్రరూపమున నేడు దయించి నఖాగ్రపంక్తి దు
ర్భావుల సంహరింపవె శుభప్రద! యాదగిరీశ మ్రొక్కెదన్.

## 5 వామన

ఉ కట్టలు కం జయించి త్రిజగంబుల నా బలి సౌఖ్య మొందగా
నెట్టి తివారసాతలమునేడును దిట్టలు స్వార్థపూర్ణులై
పొట్టకులేనిమానవులపుట్టెడుభాదలు పెట్టుచుండిరే
పొట్టిమనీషివై తిరిగి పుట్టవె యాదగిరీశ మ్రొక్కెదన్.

## 6 పరశురాముడు

ఉ నేడు పదంబులంది యవినీతి చరింతురు కొందఱల్లెడన్
పీడనొనర్చు చుండిరిదె బీదల నెల్ల భవత్కృతార మీ
నాడు భుజాన దాలిచి యనాథుల గావగ నెంచి వేగము
య్యేడులమార్లు భూమిని చరింపవె యాదగిరీశ మ్రొక్కెదన్,

# నవసమాజము-సాహితీ దృక్పథము

—ఏ. నాగేశ్వరరావు

ఉరుకుల పరుగుల ఇరవయ్యో శతాబ్దపు సమాజాన్ని—నా సమకాలీన సమాజాన్ని—నేను నవ సమాజమంటాను. నవ సమాజమంటే ఎప్పటి సమాజమని ఎవరైనా అడిగితే.

ఇక సాహితీ దృక్పథం అంటే, సాహిత్యంలోంచీ మన కగుపించే 'ఆలోచనా పద్ధతి' అని నా ఉద్దేశ్యం. దేశ, కాలాలను బట్టి ఆయా సాహిత్యాలను పరిశీలిస్తే ఒక్కో దేశపు సాహిత్యంలోంచీ, ఒక్కో కాలపు సాహిత్యంలోంచీ ఒక్కో ఆలోచనా పద్ధతి ఒక్కో దృక్పథం బయల్పడుతుంది.

అసలు 'సాహిత్యం' అన్న పదాన్నే నిర్వచించడం ఈ వ్యాసపు ఉద్దేశ్యం కాదు. భారతదేశం భారతీయ సమాజం దృష్ట్యా సాహితీ దృక్పథాన్ని నేను పరిశీలిస్తాను.

-×-

"విశ్వ శ్రేయః కావ్యం" అన్నది తరతరాల నుంచీ భారతీయ నరనరాల్లో జీర్ణించుకు పోయిన సాహితీ దృక్పథం. వైదికీ సాహిత్యం, ఆ తరువాత ఇతిహాస, పురాణ సాహిత్యాల్లో కూడా మనకు ఈ దృక్పథం గోచరమవుతుంది. సనాతన ధర్మము, తత్పరి రక్షణలన్నది ఈ సాహిత్యాలన్నింటిలోనూ సమానంగా మనకు కనిపించే ఈ దృక్పథం. మొత్తం మీద, ప్రాచీన భారతీయ సాహిత్యమంతటా ఒక నిర్దిష్టమయిన దృక్పథం స్పష్టంగా కనిపిస్తుందన్నది అతిరస్కృత యథార్థం.

ఆ దృక్పథంలో పూర్తి భారతీయత ఉంది. ఆ ఆలోచనా పద్ధతి పూర్తిగా మనది. ధర్మ బద్ధమూ, ఆనంద దాయకమూ అయి "నడచేదీ నడిపించేదీ, కదిలేదీ కదిలించేదీ" అయిన దృష్టి అది.

రామాయణం చూపించే ఆలోచనా పద్ధతి మన పల్లె పల్లెలా జీర్ణించుకుపోయిన పితృభక్తి, దాంపత్య ధర్మాలు, ధర్మ పరిరక్షణా దీక్ష ఇటువంటి మన భారతీయ దృక్కోణమే. భారతం ఘోషించే భ్రాతృ ప్రేమ ఇత్యాది దృష్టులు మనవి. పద్దెనిమిది పురాణాలు ఇటువంటి దృక్పథాన్నే ప్రదర్శిస్తున్నాయి.

మొన్నటి పద్దెనిమిదో శతాబ్దపు సాహిత్యం దాకా ఈ దృక్పథం అవిచ్ఛిన్నంగా కొనసాగింది.

కాని, మార్పుల శతాబ్దం ఇరవయ్యో శతాబ్దమే మిన్ను విరిచి నేలమీద కొరిగించింది. విప్లవాత్మకమైన మార్పులు రాకెట్ వేగంతో ఫెళఫెళ సాహిత్యంలో నుంచీ అగుపడుతున్న దేం దృక్పథం? అన్నదే తికమక పెట్టే పెద్ద చిక్కు ప్రశ్న.

ఒక మహావ్యక్తి అన్నట్లు నవ సాహిత్యానికో దృక్పథమే లేదన్నా పెద్ద ఆశ్చర్యం కలుగదు.

ఒక దృక్పథం లేకపోతే ఎన్నో దృక్పథాలు ఉండొచ్చు గదా! అన్న కొంటె ప్రశ్నకూ సమాధానం లేకపోలేదు. నిజమే ఇప్పటి సాహిత్యాన్నంతటినీ అవలోకిస్తే భిన్నా భిన్నమైన ఎన్నో దృక్పథాలు బయట పడ్తాయి. "ఎవరికి వారే యమునా తీరే" ఎన్నో ఉద్యమాలు, ఎన్నో విప్లవాలు, ఇంకెన్నో

ప్రయోగాలు మరెన్నో కొత్త పుంతలు. ఎవరియిజం వాళ్ళకు నిజం.

పచ్చిపచ్చిగా నిక్కచ్చిగా సమాజాన్ని గుచ్చిగుచ్చి మాట్లాడే దిగంబరకవులు, సంప్రదాయంమీద దుడ్డు కర్రలతో తిరగబడి స్వేచ్ఛతో గెంతులేసే తిరుగుబాటు కవులు, అణగారిన ఆర్తుడి పక్షాన వకాల్తా పుచ్చుకొని గొంతుచించుకొనే విప్లవ కవులు, వళ్ళుమరచి ప్రేయసితో ప్రకృతిలో పాడుకొనే భావకవులు, సాంప్రదాయక ఫ్యాషన్ కవులు, ఫ్యాషన్ల సాంప్రదాయక కవులూ— ఒకటా? ఎన్నో దృక్పథాలు.

నవలా కారులంతా ఒక ప్రక్కకూ నవలా కారిణులంతా మరొక ప్రక్కకూ గుంపులుగా బయలుదేరి పుంఖానుపుంఖాలుగా సాహిత్యాన్ని సమాజం నెత్తిన

ఒకామె 'రామాయణం విషవృక్షమంటే' మరోడు తారాశశాంకమని వెక్కిరిస్తాడు. ఆహల్యా, ఇంద్రుల పచ్చిసీను ఎంతబాగుందంటాడు మరో రసికుడు. వీళ్ళంతా శాడిస్టుల గుంపు. వీళ్ళు తిరుగుబాటు దార్లు. చలం వీళ్ళను పైకి లేపి తానెటో పారి పోయాడు.

"ఆకులో ఆకునై పోతానని" ఒక కృష్ణశాస్త్రి మురిసిపోతూంటే "నేనుసైతం విప్లవాగ్నికి సమిధ నొక్కటిఆహుతిస్తానని" శ్రీశ్రీమరో గావుకేక పెట్టాడు. వీళ్ళందరికీ అనుయాయులూ. శిష్య పరంపరా.

ఇక అరడుగుల అందగాడికీ, రివటు లాంటి సుందరాంగికీ ఏకబిగిన ఈస్ట్‌మన్ కలర్ ప్రేమకథలు సృష్టించే వంటింటి నవలాకారిణుల గుంపు

వీటికి తోడు, దారం తెగిన వందల గాలిపటాల కలగాపులగపు సినిమా సాహిత్యం సరేసరి

కవికీ కావ్యానికి సంబంధం అక్కర లేదు. మద్రాసు లాడ్జిల్లో ఏ సీ బెడ్రూముల్లో దొర్లుతూ "ఆకాశాన్ని అర్ధరింగా కప్పుకొన్న" డొక్కి 'పేగు' ల్లోని బాధను వర్ణించవచ్చు. అడ్డదారుల్లో గడ్డిమేస్తూ అభ్యుదయ సాహిత్యం ఒలక బెట్టొచ్చు. ఇది వీళ్ళ దృక్పథం (?)

ఈ గందర గోళం మధ్యలో ఎంతమంది విశ్వనాథలు ?

ఎందరు ప్రభంజనంలో ఎదురు నిలచివెలిగి పోగలిగారు. ఏమో?

'నూతన భావములు గంభీరములు. నూతన సంప్రదాయములు పరిచితములు, నూతనాదర్శములు సదాశాభరితములు, నూతన శైలి సంశ్లిష్టము.' అని తృప్తి పడాలా?

ఆంగ్లేయ సంపర్కముతో 'పరజాతి కీర్తనము ఆత్మ విశ్వాస శూన్యత, స్వజాతి దూషణము మున్నగునవి నవ్యుల లక్షణాలు(-గురజాడ) లెమ్మనుకోవాలా

"వీళ్ళంతా ఎక్కడికి పోతున్నారు?" (-బోయి భీమన్న) అని తికమకగా చూస్తుండాలా,

నవసమాజ సాహితీ దృక్పథమేమిటి? సాహిత్యానికంతటికీ ఒక సమాన దృక్పథము లేకపోతేలేకపోయె, కనీసం విడివిడిగా ప్రతి సాహితీ కారుడికీ తనకంటూ ఓ దృక్పథం ఉందా; ఉంటే? ఏమిటది? ఈ ప్రశ్నలకు సమాధానాలు లేవు.

'మంచికాలం ముందు ముందునా ఉందనీ' ఒక చక్కని దృక్పథం. ఈ అన్ని ప్రకంపనాల సమాహారంగా ఏర్పడుతుందా? ఏర్పడితే అది ఎట్లా ఉంటుంది? తిరిగి ప్రాచీన దృక్పథం పునరావృతమౌతుందా?

ఈ అవకాశం లేదనే చెప్పాలి. కాలపు పరుగులో నుంచీ, మిగతా ప్రపంచ సమాజాల ప్రభావం నుంచీ బయట పడి యిక ఆ దృక్పథాన్ని చేరుకొనే ప్రసక్తే లేదు. కాని ఒక్కటి మాత్రం చెప్పవచ్చు.

మన సాహిత్యానికి ఒక నాటికైనా మన దృక్పథపు ఏకాత్మత ఏర్పడుతుంది.

"జీవత్సాంప్రదాయమునకు సైతము మెట్టలు అడ్డు నిలుచును. తిరిగిపొమ్మని గిరులు బెదిరించును. అవరోధములే ఆలంబనముగా, అలంకారముగా, నెమ్మది మీద అది ప్రవహించును." అన్నది నిజము.

ఎందుకంటే డా॥ సి నా రే గారన్నట్లు :-

"కవిత్వము ప్రధానముగా అనుభూతులపై ఆధారపడిన కళ. భౌతిక ప్రపంచమున ఎన్ని విచిత్రములైన మార్పులొచ్చినను మానవునిలోని మౌలికములైన ప్రవృత్తులలో చెప్పుకోదగిన పరివర్తన లేదు. మానవునిలోని ఈ వాసనలు నశించిననాడు కవిత్వమే కాదు ఏకళయు ఉండదు."

మరి ఆ వాసనా బలమో, సాంప్రదాయపు శక్తో ఏదో ఒక విధంగా మన సాహిత్యానికి నవదృక్పథం మహోన్నతంగా ఏర్పడుతుందని ఆశిద్దాం.

ఆదోని ఆర్ట్స్ & సైన్సు కాలేజి.
ఆదోని-
కర్నూలు (జిల్లా)

# ఆధునిక దశావతారములు

'సహజకవి''

## 7 శ్రీరామ

చ పరసతి సంగమంబుచితపద్ధతిగా దనియాత్మ నెంచకే
కరమను రక్తి బూని దశకంఠుడు దుర్గతి జెందె నంచుతా
రరయరదేమొ యొంటితల రావణులిత్తటి భానువంశమం
దురయమునం జనించి వడి ద్రుంచవె యాదగిరీశ మ్రొక్కెదన్.

## 8 శ్రీకృష్ణ

ఉ దానము సత్య మార్యకుల ధర్మములెల్ల నిరాకరించి య
జ్ఞాన వశంబునన్ మనుజ జాతి సమస్తము భ్రాంతిజిక్కెనీ
వేణువునూది నాదమున వేడుక గొల్పి చరా చరంబులన్
లీనము జేయుమయ్య నవలీలగ యాదగిరీశ మ్రొక్కెదన్

# త్రిభాషా సూత్రం

శ్రీ వేమూరి ఆంజనేయశర్మ

భారతప్రభుత్వం ముఖ్యమంత్రులసమావేశం జరిపించి మనదేశంలో భాషాసమస్యను పరిష్కరించడానికి త్రిభాషా సూత్రాన్ని రూపొందించింది. దక్షిణదేశం లోనూ, ఉత్తరదేశంలోని కొన్ని ప్రాంతాలలోనూ ఈ సూత్రాన్ని అమలు పరచడానికి ప్రయత్నం జరుగు తున్నది. పండిత జవహర్‌లాల్ నెహ్రూ గారు చొరవదీసుకొని భాషా సమస్యను పరిష్కరించడానికి గట్టి ప్రయత్నం చేశారు. దానికి ఫలితంగానే త్రిభాషా సూత్రం ఏర్పడింది. భారత దేశంలో వివిధ భాషలు వ్యాప్తిలో ఉన్నవి. ఆ యా భాషలు ఆధారంగా భాషాప్రయుక్త రాష్ట్ర విభజన కూడా జరిగింది. గాంధీగారు భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన అవసరమని భావించిన వారు. ప్రజలభాషలో పరిపాలన జరగడం. ప్రజలభాషలోనే వారి దైనందిన సమస్యల పరిష్కారానికి మార్గాలు అన్వేషించబడటం అవసరమని గాంధీగారి అభిప్రాయం. అయినా మొత్తం భారతదేశాన్ని ఒకచోటికి చేర్చడానికీ, జాతీయ సమైక్యతను కాపాడడానికి వివిధ భాషల అభివృద్ధితో పాటు ఒక అనుసంధాన భాష గూడా అభివృద్ధి చెందటం అవసరమని గాంధీజీ అభిప్రాయ పడ్డారు. ఆ భాషా ప్రచారాన్ని నిర్మాణ కార్యక్రమంలో ఒక అంశంగా చేర్పించి హిందీతరప్రాంతా లన్నింటిలో ఆ భాషా ప్రచారానికి సంస్థలను స్థాపించి కృషి చేశారు. భారతదేశానికి అనుసంధాన భాష హిందీ అని కూడా వారు నిర్ధారణ చేశారు. పలువురు నాయకులు గూడా అదే నిర్ణయాన్ని సమర్థించారు. స్వాతంత్ర్యానికి పూర్వం ఈ భాషలకు సంబంధించి మనదేశంలో ఎటువంటి సమస్యలూ తలయెత్తలేదు. స్వాతంత్ర్యం లభించిన తరువాత, తమిళనాడు వంటి రాష్ట్రాలలో హిందీ వ్యతిరేకత ఏర్పడడం, తమిళనాడు ప్రభుత్వం దానిని ఒక రాజకీయ సాధనంగా ఉపయోగించడం ప్రారంభమయింది. ఇది ఒక సమస్యగా గూడా తయారయింది. భారతీయ భాషల వ్యాప్తికీ, హిందీ భాషా ప్రచారానికీ గూడా ఈ సమస్య ఆటంకం కలుగజేసే విధంగా ప్రచారంలోకి వచ్చింది. అందువల్లనే త్రిభాషా సూత్రాన్ని అంగీకరించడం, పార్లమెంటులో అందుకు అవసరమైన తీర్మానాలను అంగీకరించడం జరిగింది. కాని ఈ మధ్య మాటిమాటికీ ఈ సూత్రాన్ని గురించి సందేహాలు లేవదీసే ప్రయత్నం తిరిగి ప్రారంభ మైనట్లు కనపడుతున్నది. పార్లమెంటులో జరిగిన నిర్ణయాలను కూడా వక్రంగా చిత్రించే ప్రయత్నం కూడా జరుగుతున్నట్లు పత్రికల ద్వారా మనకు తెలుస్తున్నది. 1968లో పార్లమెంటులో జరిగిన తీర్మానాన్ని పొందు పరుస్తున్నాము

"RESOLUTION ON LANGUAGE POLICY
MINISTRY OF HOME AFFAIRS.

New Delhi, the 18th January, 1968.

RESOLUTION

No. F. 5/8/65- OL. The following Government Resolution, as adopted by both Houses or Parliament, is hereby published for general information :-

RESOLUTION

WHEREAS under article 343 of the Constitution Hindi shall be the official language of the union. and under article 351 there of it is the duty of the Union to promote the spread of the Hindi language and to develop it so that it may serve as a medium of expression for all the elements of the Composite culture of India;

This house resolves that a more intensive and comprehensive programme shall be prepared and implemented by the Government of India for accelerating the spread and development of Hindi and its progressive use for various official purposes of the Union and an annual assessment report giving details of the measures parliament, and sent to all State Governments.

2. WHEREAS the Eighth Schedule to the Constitution specifies 14 major languages of India besides Hindi, and it is necessary in the interest of the educational and cultural advancement of the country that concerted measures sohuld be taken for the full development of these languages ;

This House resolves that a programme shall be prepared and implementedi by the Government of India, in collaboration with the State Governments for the coordi nated development of all thesel anguages, alongside Hindi, so that they grow rapidly in richness and become effective means of communication modern knowledge.

3. WHEREAS it is necessary for promoting the sense of unity and facilitaing communication between people in different parts of the country that effective steps should be taken for implementing fully in all States the three - language formula evolved by the Government of India in consutation with the State Government ;

This House resolves that arrangements should be made in accordance with that formula for the study of a modern Indian Language, preferably one of the

Southern languoges, apart from Hindi and English in the Hindi-speaking areas, and of Hindi along with the regin al languages and English in the non-Hindi-speaking areas!

4. And whereas it is necessary to ensure that the just claims and interests of people belonging to different parts of the country in regard to the public services of the Union are fully safeguarded:

THIS HOUSE RESOLVES :

a) that compulsory knowledge of either Hindi or English shall be required at the stage of selection of candidates for recrui tment to the Union services or posts except in respect of any special services or posts for which a high standard of knowledge of English alone or Hindi alone, or both as the case may be, is considered essential for the satisfactory performance of the duties of any such service or post ; and

b) that all the languages included in the English Schedule to the Constitution and English shall be permitted as alternative media for the All India and Higher Central Services examinations after ascertaining the views of the Union Public Service Commission on the future scheme of the examinations, the procedural aspects and timing."

ORDER

ORDERED that a copy of the Resolution be communicated to all State Governments/Union Territories and Monistries of the Government of India.

ORDERED also that tre Resolution be published in the Gazette of India for general information."

ఈ తీర్మానాన్ని పరిశీలించిచూస్తే స్పష్టమైనరూపం మనకు బోధపడుతుంది. నెహ్రూగారి త్రిభాషా సూత్రమనీ, ఇందిరాగాంధీ గారి త్రిభాషా సూత్రమనీ, ఇంకెవరిదో త్రిభాషా సూత్రమనీ వేరువేరు త్రిభాషా సూత్రాలు లేవు. పార్లమెంటులో అంగీకరించబడిన త్రిభాషా సూత్రం ఒక్కటే. కాని దాన్ని అమలు పరచే బాధ్యత ప్రాంతీయ ప్రభుత్వాలమీద వున్నది. ప్రాంతీయ ప్రభుత్వాల సహకారంతోనే విద్యారంగంలో ఈ సూత్రాన్ని కేంద్రప్రభుత్వం అమలు చేయగల్గుతుంది. కొన్ని ప్రాంతీయ ప్రభుత్వాలు అమలు చేస్తున్నవి. కొన్ని చేయడం లేదు. దానిని ఏ విధంగా అమలు చేయాలి, అందుకు ఎటువంటి ప్రయత్నం జరగాలి అనేది సమస్య. అంతేగాని వేరుగా ఆ సూత్రానికి ఇంకొక రూపకల్పన చేయవలసిన అవసరం లేదు పార్లమెంటు అంగీకరించిన ఆ తీర్మానంలో మూడు భాగాలు ముఖ్యమైనవి. రాజ్యాంగ చట్టం

లోని ఎనిమిదవ అనుసూచీలో 15 భాషలు భారతీయ భాషలుగా అంగీకరింపబడివున్నవి. వాటిలో హిందీ గూడా ఒకటి. 8వ అనుసూచీ లోని భాషలన్నింటి అభివృద్ధికి ప్రాంతీయప్రభుత్వాల సహకారంతో కేంద్ర ప్రభుత్వం కృషి చేయాలి అనేది మొదటి విషయం. అందుకు కేంద్రప్రభుత్వం కృషిచేస్తూనే వున్నది. 18 కోట్ల రూపాయలు అందుకు కేటాయించింది. కేంద్ర ప్రభుత్వమిచ్చిన కోటి రూపాయల తోనే ఆంధ్రలో తెలుగు ఆకాడమీ ఏర్పడింది.

ఇక రెండవ విషయం త్రిభాషాసూత్రం. భారత దేశంలో జాతీయ సమైక్యతను సాధించడానికి త్రిభాషా సూత్రం అవసరమని ప్రాంతీయ ప్రభుత్వాల సహకారంతో ఆ సూత్రాన్ని కేంద్రప్రభుత్వం అమలు పరచవలెనన్నది రెండవవిషయం. హిందీతర ప్రాంతాలలో హిందీ ఇంగ్లీషు భాషలతో బాటు అక్కడి ప్రాంతీయ భాషను నేర్పే ప్రయత్నం జరగవలెననీ, హిందీ ప్రాంతాలలో హిందీ ఇంగ్లీషులతో బాటు ఒక భారతీయ భాషను నేర్పించవలెననీ, ఆ భారతీయభాష ముఖ్యంగా దక్షిణదేశ భాష అయి వుండడం వాంఛనీయమనీ తీర్మానం ఆదేశిస్తున్నది. ఈ సూత్రాన్ని ప్రాంతీయ ప్రభుత్వాలు అమలు చేయాలి. సామాన్యంగా ఏదో ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొని భాషలు నేర్చుకొనడం జరుగుతుంది. కనుక ఉత్తర దేశంవారు దక్షిణదేశభాషను నేర్చుకొని ఏమిచేయాలి? అనే ప్రశ్న ఒకటి ఉన్నది. ఉత్తరదేశంలోని కొన్ని ప్రాంతాలలో 8వ అనుసూచీలోని ఒక భాషను నేర్పించడానికి ప్రయత్నం జరుగుతున్నది. ఒక దక్షిణ దేశ భాషను నేర్పించే ప్రయత్నం గూడా జరుగుతున్నది. కాని అది అంత సంతృప్తికరంగా లేదు. అందుకు కృషిచేయడం అవసరం.

ఇక మూడవ విషయం హిందీ రాజ భాషగా అంగీకరించబడిన తరువాత ఉత్తరదేశంలో చాలా విశ్వవిద్యాలయాలు ఇంగ్లీషును వదలివేశాయి. విశ్వవిద్యాలయ పాఠ్యక్రమంలో ఇంగ్లీషుకున్న ప్రాధాన్యాన్ని తగ్గించివేశాయి. రాజ్యాంగచట్టం ప్రకారం హిందీ మన రాజభాష. పార్లమెంటుతీర్మానం ప్రకారం హిందీరానివారి సౌకర్యం కొరకు ఇంగ్లీషును సహరాజ భాషగా అంగీకరించడం జరిగింది. హిందీతరప్రాంతాల వారు కోరినంతకాలం ఇంగ్లీషు సహ రాజభాషగా వుంటుంది. అంటే భారత ప్రభుత్వ కార్య కలాపాలన్నీ ద్వైభాషిక నీతిని అనుసరించి జరుగవలసి వున్నది. ఇప్పుడదే జరుగుతున్నది. ఇంగ్లీషు హిందీ రెండింటికీ ఆ ద్వైభాషిక విధానంలో స్థానం ఏర్పడి వున్నది. ఇదీ పరిస్థితి. ద్విభాషా విధానం ప్రకారం గవర్నమెంటు ఉద్యోగాలలో చేరవలెనంటే రెండు భాషలూ అనగా హిందీ మరియు ఇంగ్లీషు రావడం అవసరం. ఉద్యోగంలో చేరేవారికి ద్వైభాషిక విధానం ప్రకారం హిందీ ఇంగ్లీషులు రెండూ రావలసి వున్నది. దక్షిణదేశంలో ఇంగ్లీషు కున్నంత ప్రాముఖ్యం హిందీకి లేదు. ఉత్తర దేశంలో ఇంగ్లీషు పరిజ్ఞానం తక్కువయిపోయింది. అందువలన పార్లమెంటు తీర్మానంలో హిందీ మరియు ఇంగ్లీషు అనేదానికి బదులు హిందీ లేక ఇంగ్లీష్ అనే వాక్యం చేర్చబడింది. ఈ వాక్యానికి ఉద్యోగాలతోనే సంబంధం. దీనికి త్రిభాషాసూత్రానికీ సంబంధంలేదు. గవర్నమెంటుఉద్యోగాలలో హిందీగానీ ఇంగ్లీషు గానీ వచ్చినవారు చేరవచ్చునని దీనికి అర్థం. అయినా ప్రభుత్వవ్యవహారం రెండు భాషలలోనూ జరగవలసి ఉన్నది గనుక ఉద్యోగంలో చేరిన తరువాత కొద్ది నెలల్లో ఇంగ్లీషుద్వారా చేరినవారు హిందీని

నేర్చుకొనడం, హిందీ ద్వారా చేరినవారు ఇంగ్లీషును నేర్చుకొనడం అవసరం. ఇది 1968 పార్లమెంటు అంగీకరించిన తీర్మాన సారాంశం. దీనిలో సందేహాలకూ, ఆరోపణలకూ తావు ఏమీలేదు. హిందీ లేక ఇంగ్లీషు అనేది యూనియన్ సర్వీసు- ఉద్యోగాలకు సంబంధించినది. పార్లమెంటు అంగీకరించిన తీర్మానాన్ని చిత్తశుద్ధితో అమలుచేస్తే ఎవరికీ ఎటువంటి ఇబ్బందులూ వుండవు. హిందీతర ప్రాంతాలవారు హిందీలో ప్రాముఖ్యం సంపాదించనంత వరకు ఇంగ్లీషు సహరాజభాషగా వుంటుంది. ద్వైభాషిక విధానం అమలులో వుంటుంది. తీర్మానం స్పష్టంగా వున్నది.

కాకపోతే ప్రాంతీయ ప్రభుత్వాలు ఈ తీర్మానాన్ని చిత్తశుద్ధితో అమలు చేయడం లేదు. దానికి కేంద్రాన్ని నిందించి ప్రయోజనం లేదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలూ, స్వచ్ఛంద సంస్థలూ అందుకు కృషిచేయాలి. దేశనాయకులూ, పెద్దలూ అందుకు దోహదంచేయాలి. ఇంకా సందేహాలు పెంచడానికి ప్రయత్నం చేయగూడదు.

# ఆధునిక దశావతారములు

"సహజకవి"

### 9 బుద్ధ

చ ఇతరుల సౌఖ్యమించుకసహించక యెగ్గు దలంచు చాత్మసం
తతపరహింస జేయుచూ వృథావచన ప్రియులాత్మ వంచకుల్
అతుల దురంత దుష్కృత దురాశయి లొప్పిరి బుద్ధ మూర్తివై
క్షితి సవరించి గావగదె శ్రీకర యాదగిరీశ మ్రొక్కెదన్

### 10 కల్కి

చ ధరణి సమస్త ప్రాణులకు దార మనంబున జాలు నన్నమున్
విరివిగ నీవొసంగి నను పేదల వేదన నొందజేయుచున్
నరదనుజుల్ హరింత్రు కరుణా రహితుల్ వెస కల్కి రూప మి
త్తఱి గొని రాగదే యని ముదంబున యాదగిరీశ మ్రొక్కెదన్

# సాహిత్యగోష్ఠి

## నవ కాంతి కవితల "జ్వాలా లేఖిని"

ప్రభాతాల సందేశాలను మోసుకొచ్చే
ప్రత్యూష వార్తా హరుణ్ణి నేను:
కాంతి సంకేత ధరుణ్ణి నేను;
అంధకార నిశ్శబ్దారణ్యాలలో
ఆరని కాగడాలతో నడిచే కవిని నేను;

అనే వుదాత్త వ్యక్తిత్వం. అప్రతిహత ఆత్మవిశ్వాసం గల డా॥ దాశరథి గారు జాతిలో చైతన్యం కలిగించడానికి జాతిని జాగృతితో వెలిగించడానికి కవిత్వాన్ని రాస్తున్నారు కవితా ధ్వనిని వినిపిస్తున్నారు.

డా॥ దాశరథి గారు నిరంతరం అక్షర తపస్సు చేసే అభ్యుదయ కవి ఋషులు. ఇప్పటికి వీరిని ఎన్నో కవితా సంపుటులు వెలుగులోకి వచ్చి రసజ్ఞ కవితా ప్రియుల మన్ననల నందుకున్నాయి. ఈ "జ్వాలా లేఖిని" నవకవితా ప్రియులకు "రక్తాక్షి" ఉగాది కానుకగా అందించబడింది. ఒకదీపావళి సందర్భంగా 'ఆంధ్ర ప్రభ' (15-11-82) దిన పత్రిక)లో డా॥ దాశరథి గారు ప్రచురించిన కవిత పేరు "జ్వాలా లేఖిని" నా సూచన మేరకు ఈ సంపుటికి ఆపేరే పెట్టటం జరిగింది. అయితే ఈ "జ్వాలా లేఖిని" విశిష్టత ఏమిటి ? అని ప్రశ్నిస్తే —

"తెల్ల కాగితం మీద నల్లక్షరాలు వ్రాస్తుంది. సాదా లేఖిని నల్లని చీకట్ల మీద నవకాంతి కవితలు వ్రాస్తుంది. జ్వాలా లేఖిని. ఈ జ్వాలా లేఖినిలోని యెర్ర సిరాయే — స్నేహం ; ఈ స్నేహ దీపం వెలిగిననాడే—పుణ్యగేహం;" అనే సమాధానాన్ని దాశరథి గారి మాటల్లోనే చెప్పాలి. సాదా లేఖిని కన్నా ఇది ఎంతో విలక్షమైనది. అందుకే ఈ జ్వాలా లేఖిని ఆరిపోదు, ఇందులోని చైతన్య మషీపంకం ఇంకిపోదు. రణ బీజాలు వెదజల్లే రాక్షసుల మీద; మృత్యు కేదారాలు పండించే ఉన్మాదులమీద దాశరథి గారికి చెప్ప లేనంత ద్వేషం. పట్టరానంత ఆగ్రహం. దాశరధి గారు శాంతి కాముకులు. భావ విప్లవ వాదులు. విప్లవాలు హృదయాల్లో ఎదగాలనే హృదయవాదులు. అందుకే—"నమ్రంగా ఆశ్రమవనంగా, ధరణిని మారుస్తాం కమ్రకంఠాల శాంతి కోకిలలతో మేడంతా ఉగాదిగా తీరుస్తాం." అని సంతస మైన నిత్య వసంత సంగీతాన్ని వినిపించారు. నవవసంతో దయానంద సమయంలో దాశరథి గారి హృదయ కోకిల పలికే గీతంలో ఆశావాదం తొంగి చూస్తుంది. ఇంకా—

అన్నమో రామచంద్రా ! అనే మనిషి లేనినాడు
అసలైన ఉగాది ఆనంద రథం మీద వస్తుంది;
ఆ నవ రథ సారథినై ప్రజా పథాల మీద
అనుగమించగల శక్తిని కోరుకుంటున్నాను."

అనే దాశరథి గారి కోరిక ప్రజా శ్రేయో కాముకత్వానికి ప్రతీక, నిజమైన ప్రజాకవి ఏకవిత్వం రాసినా ప్రజల్ని, ప్రజల ఆకల్ని మరువవేడు. దాశరథి గారు కూడా నిజ మైన ప్రజాకవి కాబట్టే పై విధంగా ప్రజా పథాల మీదనే తమ కవితా చైతన్య యాత్రను కొనసాగిస్తానంటున్నారు.

"పండుగనాడు గుండె మంటలను మరచి
ప్రజావళి సంతోషాతి రేకంతో
తర తమ భేదాలు విడిచి జీవించగల
తరుణ సామ్యవాద సాధన శక్తిని కోరుకుంటున్నాను."

ఈ విశిష్టమైన కోరికలో దాశరథి గారికి ప్రజల పైవున్న ఆత్మీయత, ఆర్ద్రత, అభిమానం, అనురాగం ఎంతటి గొప్పవో తెలుస్తుంది. అందుకే—"ధనం మీద కాదు, మహా జనం మీదనే నాకు ఆశవుంద"ని సంక్రాంతి రుబాయీని వినిపించారు.

'హిమాంబరం ధరించిన సంక్రాంతి అంబరం
ఈ ధరణికి దిగివస్తే నాకెంతో సంబరం;
అంత రంగంలోని ఆరంగవల్లికలు

అంతులేని నా అనురాగ మాలికలు''. అని సంక్రాంతి సంబరాన్ని సంభావించుకున్నారు. ఈ సంభావనలో దాశరధి గారి రమ్య వీక్షణము, మధురభావ విలసనము. కవితా ప్రియులకు ఆనందాన్ని కలిగిస్తాయి.

"వసంతం, కవుల కవితల్లోనైనా వుంటుందనుకున్నాను'' అనటంలోని అవేదన; చమత్కారం, శాంతి ప్రియత. సౌందర్యారాధనము ధ్వనించి దాశరథి గారి హృదయ వైలక్షిణ్యము అవిష్కరింపబడుతున్నది.

"ఎర్రకోట మీద ఎగిరే జెండా నా హరివిల్లు; ఈ విశాల భారతావనీ స్వాతంత్ర్య దేవతకు అది ఇల్లు; స్వాతంత్ర్య దేవతా సహస్ర శిఖరాలయంలో, భారత ప్రజ లక్షల, కోట్ల సంఖ్యలో పూజలు, జరుపుతున్నారు''.

అన్న దాశరథి గారి దేశభక్తి తత్పరత అదర్శవంత మైనది. దాశరథి గారికే కాదు మనందరికీ కూడా ఆ స్వాతంత్ర్య దేవత అంటే ఎనలేని భక్తి, అందుకు కారణం ''అన్ని విభేదాలను మరపించే మహాశక్తి'' అస్వాతంత్ర్య దేవత కావడమే, అందుకే ఆమె పావన పాదాల పైనే ఎల్లప్పుడూ మన మనస్సు లగ్నమైవుంటుంది. దాశరథి గారి దృష్టిలో స్వాతంత్ర్య దినోత్సవం అంటే శ్రామిక ప్రజాజయోత్సవమనే అర్థం. ఇల్లాలు, పిల్లలు చల్లగా జీవించ గలిగే శుభదినం కోసమే దాశరథి గారి ఎదురు చూపు.

దాశరథి గారిలో ప్రణయం, ప్రళయం సమపాళ్లలో మేళవింపబడటం; చెప్పదలచుకున్న విషయాన్ని చమత్కారంగా; రసవంతంగా; గుండెల్లో నాటుకొనేట్లు చెప్పటం... అనే ఈ లక్షణాలు మనకు వారి కవిత్వాన్ని పరిశీలిస్తే సర్వే సర్వత్రా గోచరిస్తాయి. అంతేకాదు, వారు కవితల్లో దొర్లించిన కొన్ని పాదాలు మరపురానివై, మరువలేనివై ఎప్పటికీ మన హృదయాల్లో మారుమ్రోగుతూవుంటాయి. అందుకే ఈతరం కవులందరిలో దాశరథిగారికి ఓ ప్రత్యేక మైన స్థానం వుంది. పద్యం రాసినా, గేయం రాసినా, వచన కవిత రాసినా, గజల్ రాసినా, రుబాయీ రాసినా. దాశరథిగారి ముద్ర స్పష్టంగా కనిపిస్తుంది. ఏదో సందేశం ఇవ్వటానికే దాశరథి గారు కవిత్వాన్ని రాస్తారు. పేలవ మైన మాటల పోగులుగాని, అరిగిపోయిన బూజు భావాలు కాని దాశరథి గారి కవిత్వంలో మనకు మచ్చుకు కూడా కనిపించవు' కొన్ని పాదాల్ని ఉదాహరిస్తాను. గమనించండి

''జాబిలి లేని గగనం
కౌగిలిలేని యవ్వనం,''
''మోదుగు పూ జెండాలు ఎగిరేయి
ఎదలో వలపుల
"ధరలో వున్నన్నాళ్ళూ 'ధర'లు తప్పవు,
ధరలు పెరుగ, నిరుపేదల చెరలు తప్పవు.''
"చెరకు గడను చేతబూనిరా !
మర తుపాకి మాట మరచిపో !''
''ఎదురు తిరగండి ఈ చలి తుపానులపై
ఎదలు కలపండి స్నేహ వేదికలపై.''
''రణభయమ్ములేని, రక్తపాతములేని
మహిని మానవుండు మనెడు గాత !''
''నేను ఉషః కన్యా పాణిపీడనం చేసినవాణ్ణి
దీనజనక్షీణ హృదయాల చీకటికి పగవాణ్ణి''
''దుప్పటి, కుంపటి లేని పేదవానికి
నిప్పులాంటి చెలిపెదవులు దొరికినవి''
''తెలుగురమకు పర్యాయపదమై
వెలుగు వికసించె;
వెలుగునకు ఆమ్రేడితమ్మై
తెలుగు వినిపించె !''
''ఘర్మజల కణాలతో
కాంతించే దీపావళి
కర్షక, కార్మిక, కవిగణ
హర్షానికి నివాళి !''
"జెండా కొనుక్కోలేని పేదవాడు
గుండెనే జెండాగా ఎగరేస్తాడు.''
"అవకాశవాదం ఈనాటి వేదం
అధికార దాహం అంతులేని మోహం''
''స్వాతంత్ర్య సరోవర జలాలలో
సామ్యవాద సరోజం వెయ్యి రేకులలో విచ్చుకోవాలి.
శతశహస్ర కిరణాలతో
శ్రామిక హృదయాకాశంలో చైతన్య సూర్యోదయం కావాలి

పై వుదాహరణలన్నీ ఒక కోవకు చెందగా, ఇప్పుడు ఇవ్వబోయేవుదాహరణలు దాశరథిగారి ప్రత్యేకవ్యక్తిత్వాన్ని నూతన భావ వ్యక్తీకరణని వెల్లడిస్తాయి.

"మమత పొంగు నవమధువు మాకిడకున్నా
మధువు తడికి మెరిసే నీ పెదవులె చాలు". (గజల్)
''దేవుడు నీవై జీవుడునేనై
విడివడి ఎన్నాళ్ళుందెదమె ?
నీ వే నేనై నేనే నీవై
ఉందామంటే పలకవులే.'' (గజల్)
''దాహానికి కావాలి నీరో మోరో
ప్రతి వారికి కావాలి ఊరో పేరో;
ప్రాచీనులు వ్రాశారు నీళ్ళే త్రాగి
నవకవులకు కావాలి బీరో ! బారో ! (రుబాయీ)
"రోగిగారి బంధు వొకడు రోదించాడు
రోదించి అలసిపోయి మరణించాడు;
ఏడ్పుగొడవ తగ్గగానె రోగం తగ్గి
రోగికోలుకొని తుదకు జీవించాడు !' (రుబాయీ)

ఇలా ఎన్నైనా వుదాహరణలు ఇచ్చుకుంటూ పోవచ్చు. మిగిలిన వాటన్నింటిని పాఠకులు చదివి స్వయంగా ఆస్వాదిస్తే బాగుంటుంది. దాశరథిగారి 'జ్వాలా లేఖిని' విరజిమ్మిన వెలుగుల్లో పయనించటానికి ఉద్యమించవలసిందిగా సలహా ఇస్తున్నాను.

దాశరథి గారి కలం బలం కలకాలం వుండి ఎన్నో నవకాంతి కవితల్ని పండించాలని; దాశరథి గారి గళం బలం అక్షయమై ఎన్నో ప్రజా సౌభాగ్య సౌజన్య గీతాలను రవళించాలని మనస్ఫూర్తిగా కోరుకుంటూ; అనుక్షణం దాశరథి గారి కవిత్వ శరధిలో మునకలు వేస్తూ; ఆణిముత్యాల్లాంటి సందేశాలను సంగ్రహించుకోమని నవకవితా ప్రియు లందర్నీ అభ్యర్థిస్తూ సెలవు తీసుకుంటున్నాను !!

**డా॥ ఆచార్య భావన్**
(తెలుగు లెక్చరర్)
దాసన్నపేట విజయనగరం – 8

\+ \+ \+ \+

# ఇది ముద్రా రాక్షసమా ?

"అధిక్షేప శతకములు" అనే పేరుతో అరు అధిక్షేప శతకాలను ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడిమీ వారు 1982లో ప్రచురించారు. వానిలో కూచిమంచి తిమ్మకవి రచించిన భర్గశతకం మొదటిది. ఈ శతకకాలాన్ని నిర్ణయిస్తూ సంపాదకులు డా॥ కే. గోపాలకృష్ణరావు గారు దాదాపు క్రీ. శ. 1759లో ఈ భర్గ శతకాన్ని రచించి యుంటాడని పీఠిలో వ్రాసారు.

కాని శతకంలోనే తన శతక రచనా కాలాన్ని గూర్చి అంతరంగిక సాక్ష్యంగా పేర్కొన్నయీ పద్యాన్ని సంపాదకులు పరిశీలించినట్లులేదు.

మ॥ ధరలోనెన్నగ శాలివాహన శకాబ్దంబుల్ దగన్యామినీ
కరబాణాంగశశాంక సంఖ్య చెలువైగన్పట్టు "సౌమ్యా" హ్వయ
స్ఫురదబ్దంబున నిమ్మహా శతకమే పూర్ణంబుగా వించి శ్రీ
కర. లీలన్ బుధులెన్నునీ కిడితి భర్గా ? పార్వతీ వల్లభా ? (భర్గ. శ॥ 100)

ఈ పద్యాన్ని బట్టి శతకరచనా కాలం శాలివాహన శకం "యామినీ కరబాణాంగ శశాంక సంఖ్య" అనగా 1651+78 క్రీ శ. 1729 అవుతుంది. (క్రీ. శ. ప్రారంభమైన 78 సం॥కు శాలివాహన శకం ప్రారంభం) పై పద్యంలో పేరొన్నట్లుగా క్రీ. శ. 1629 సౌమ్యనామ సంవత్సరమే. ఇప్పుడు నడుస్తున్న రుధిరోద్గారి నామ సంవత్సరానికి పదునాల్గు సంవత్సరాలకు ముందు అనగా క్రీ. శ. 1969లో సౌమ్యనామ సంవత్సరం వచ్చింది. ఈ 1969 కి 4 సౌమ్యనామ సంవత్సరాలు వెనుకకు లెక్క వేస్తే పై పద్యంలో పేర్కొన్న 1729 సౌమ్యనామ సంవత్సరమే అవుతుంది.

ఈ అంతరంగిక సాక్ష్యాన్ని బట్టి భర్గ శతక రచనా కాలం క్రీ శ. 1729. అంతేకాని సంపాదకులు పేర్కొన్న 1759 మాత్రం కాదు. అయితే క్రీ. శ. 1759 అనేది ముద్రారాక్షస మంటారా ? అయితే అత్యంత ప్రాధాన్యమైన శతక రచనా కాలాన్ని తెలియచేసే సంఖ్యయే తప్పుగా ముద్రణలో పడినా సవరించకపోవటం మిక్కిలి శోచనీయం. కాని సంపాదకుల దృష్టికి శతకంలోనే ఉన్న అంతరంగిక సాక్ష్య పద్యం రాకపోవడాన్ని బట్టి ఇది ముద్రారాక్షసం కాదేమో ననిపిస్తోంది.




## "వృషభ పురాణం"

కవితాసంపుటి (వెల: 15 = 00)
గ్రంథకర్త: పేర్వారం జగన్నాథం.
సాహితీ బంధు బృందం.
1/705 5-డి-e మిథిలానగర్
హనుమకొండ. వరంగల్-1.

శ్రీ పేర్వారం జగన్నాథంగారి శబ్దజాలమంత వ్యంజకమే, వ్యంగ్యార్థ బోధనా శక్తుల నలవరచుకున్న సిద్ధ హస్తులు. చదువరులకు సులభ గ్రాహ్యమగు శైలిలో రచన సాగును పుస్తకము చదువుతున్నంతసేపు పాఠకుడు నవ్వకుండా వుండలేడు. యుక్తి ఎరిగిన వక్రోక్తి. అభివ్యక్తీకరణలో అధిక్షేపాత్మక రచనా నైపుణ్యంతో మీటెడి విపంచీ లలితతర మంజీరాలు. 1960లో వీరి మొదటి కవితా సంపుటి "సాగర సంగీతం" వెలువడింది. కాలానుగుణంగా సాహిత్యము తన ధర్మమును నెరవేర్చవలసి యున్నది. ఇది కవి ముఖతః జరుగుతుంది. 1961 నుండి 1970 వరకు రాసిన కవితల్ని కూర్చి "వృషభపురాణం"లో వెలువరించారు. ఇటీవలికాలంలో సర్వశ్రీ జలసూత్రం రుక్మిణీ నాథ శాస్త్రి. మాచిరాజు దేవీప్రసాద్. కాళోజి, పల్లా రామకోటార్య మహీధర నళినీ మోహనరావు వంటి కొద్దిమంది కవులు మాత్రమే అధిక్షేపాత్మక రచనలు సాగిస్తున్నారు. పేర్వారం జగన్నాథం గారు నైజాం రాచరికానికి వ్యతిరేకంగా పోరాడి సర్వస్వాన్నీ త్యాగం చేసిన అమర వీరులను కళ్లారా చూసిన వ్యక్తి. పోలీసు చర్య జరిగిన అనంతరం ఈ దేశం సౌభాగ్యవంతమవుతుందని ఆశపెట్టుకున్న వ్యక్తి,

ఆశలు అడియాశలైనవి. మానవత ఆద్రసు లేకుండా పలాయనమైన తరుణంలో "వృషభ పురాణం" ను విప్లవ యోధుడు అయిన కళాప్రపూర్ణ శ్రీ రావినారాయణ రెడ్డికి సమర్పితం గావిస్తూ సహృదయుల కందించారు. ముఖపత్రంపై దీనజనోద్ధరణకోసం కామధేనువులా పోజుపెట్టి నీతులు బోధిస్తున్న వృషభ రాజము- గళమున గంటలకు బదులు నోట్లుహారాలంకృతమై వుంది. శీలా వీరాజు గారు చిత్రరచన చేసినారు. ఇందు ముప్పది ఏడు కవితలున్నవి. అందు మొదటి కవిత "వృషభ పురాణం" పాలకుల దుర్నీతి ఇందు స్పష్ట పరుస్తూ కల్తీ వ్యాపారాన్ని నిరసిస్తున్నారు.

"లంచాల్ని ఎరువులుగా పోసి
విషముష్టికాయలు పండిచే వాళ్లు
నూటికి తొంబది తొమ్మిది పాళ్ళు
పండిన సరకునంతా అంగట్లో పోసి
తునికి పండ్లని నమ్మించి
పెరుగుతున్న జనాభా సమస్యను
పరిష్కరిస్తారు వర్తక సామ్రాట్టులు" (పే.3)

గ్రామాల్లో విద్యుదీకరణ తీరును తెలుపుతు.

"గ్రామానికి విద్యుత్తు తెప్పించినా
కాలిపోయిన బ్రతుకు బల్బులు
ససేమిరా వెలుగడం లేదు" (పే. 3)

సన్నకారు రైతు అగచాట్లు ఒక్క మాటలో ఇలా అంటున్నారు.

"రైతుగారి బ్రతుకు సమస్తం
చెదలుపట్టిన ఖాతాపుస్తకం
ఎట్లుచెల్లించు టంకంబు లేడునూర్లు "(పే 11)
ప్రజాహిత చర్యలకై కేటాయించిన సొమ్మును
"మధ్యలో ఎవరో కాజేస్తే
ఎవరుమాత్రం చేసేదేమున్నది
ఓటేయునప్పుడే ఉండాలి బుద్ధి
అంటాడు పనిలేని మన కాళోజీ" (పే. 12)

అంటూ ప్రజాకవి మాటల్ని పునరుద్ఘాటించారు. "కీలెరిగివాత" కవితలో ప్రజాసామ్యంలో పౌరుడెలా వుండాలో ముక్కుసూటిగా నొక్కిచెపుతారు. "కనకపు సింహాసమున" గుండాఇజం, దోపిడి, మోసం ఇత్యాది సర్వరోగ సమ్మిళిత నాయకత్వం, విశ్వాసం కోల్పోయిన కుక్కప్రతీకగా సాగిన కవిత.

"ఈ కుక్క నిన్నటి దాకా
ఎక్కడెక్కడో తిరిగి ఏమేమోతిన్నది."(పే.15.)
నోట్లోవేసుకోబోతున్న బిచ్చకత్తె
చేతిలోని కబళం కాజేసింది.(పే. 16)

ఒంటిపై జింకచర్మం కప్పుకొని
జీవకారుణ్య సంఘంలో
ఇటీవలె సభ్యత్వం పుచ్చుకొని
మానవతా వాదం గూర్చి
మాతృదేశ గౌరవాన్ని గూర్చి
ఉపన్యసిస్తున్నది " (పే.16.)

ఇలాంటి కుక్కలాంటి నాయకుల **మాటలకు** మోసపోయి..........

"కుక్క తోక పట్టుకొని
గోదావరినీదకండి
నట్టేట్లో ముంచేసి అదిమాత్రం
ఆవలితీరం చేరుకుంటుంది." (పే. 17)

అని మనకు తెలిసిన మాటల్లోనే ప్రబోధిస్తున్నారు. అధికార వర్గంలో లంచగొండు తనం, బంధువర్గీయుల పేర కాంట్రాక్ట్ పద్ధతులలో ప్రజాధనం దోపిడి పాలైనప్పుడు...............

"గుడినే మింగిన వానికి
గుళ్లో లింగంవో లెక్క (పే.19)

దేశద్రోహానికి తలపడు వారిని గురించి "ఇదిరహదారికాదు." అను కవితలో మన కర్తవ్యాన్ని గుర్తుకు తెస్తూ....

"కిరాయిదుస్తుల్లో దర్జాగా
దొరవేషం వేసుకొని వచ్చి
మోసాల గరంమసాలా తినిపించి
జేబులోపైకం కాస్తా కొట్టేసి
తప్పుదారి పట్టించినాడు
ఎక్కడో ఈ పొదల్లోనే
దాగుడుమూతలాడు కున్నాడు
చుట్టూవెదకి మట్టుపెట్టాలి వాణ్ణి
పిట్టలేవంది జొన్నచేను దక్కదు
(పేజి 21)

సుశిక్షితుడైన సైనికుడు వదలిన
తుపాకుగుండులా ప్రయాణించు" (పేజి 22)

జాతిపితగాంధీజీ ఆశించిన ప్రగతి పథానికి మేమంటేమేం బాటలు వేస్తామనే రాజకీయ రాజుల గూర్చి

"గాంధీగారునాటిన వటవృక్షం
గబ్బిలాల్లా వ్రేలాడుతున్న వాళ్ళు
లంకా నగరానికి
నరమాంసం ఎగుమతి చేసే
లిమిటెడ్ కంపెనీ వాళ్ళు
తడి గుడ్డతో గొంతులు కోయడం
వాళ్లకుమాత్రమే తెలుసు
దాని ఊడల నీడల్లో బ్రతుకుతూ
వృక్షమూలాన్ని కొరుక్కుతింటున్న వాళ్ళు"
(పే.59)

లోకజ్ఞులు, మేధావులు ఓర్పువహించి ఓటింగ్‌లో పాల్గొనడం లేదు. ఏరకమువారు ఆరకమువారినే ఎన్నుకుంటారు. ఇక మేధావులంతా ముందుకు రావాలని..........

"ఉత్తర గోగ్రహణం జరిగింది,
ఉత్తరుడు రథందూకి పరుగెత్తుతున్నాడు.
అజ్ఞాతవాసం నేటితో ఐపోయింది
ఇంకా ఈ బృహన్నలవేషం ఎన్నాళ్ళు
ఈ విరాటరాజు కొలువు చాలించు" అని సమయం మించిపోకముందే గుర్తుచేస్తూ
నీవు త్రాగుతున్నటానిక్‌లో
విటమిన్లులేవు సరికదా
ఎప్పుడోదాని గడువు దాటింది
ఇప్పుడది హలా హలంతోసరి, (పేజి 28

* * * *

ఇక్కడ దేవుణ్ణి కూడా నమ్మేదిలేదు
నమ్మక్ హరాంలో వాడు మొదటిరకం
పరీక్షలో అడిగే ప్రశ్నలన్నీ
ఔటాఫ్ సిలబస్" (పేజి 29)

ఇక క్రొత్తగా రాజకీయాల్లోకి ప్రవేశం గోరే వారికి సలహా..........

"బాబూ! ఈ పద్మవ్యూహంలోకి
తొందరపడి దూసుకపోకు
తిరిగిరావడం తెలియ నప్పుడు
అందులో కాలిడనేవద్దు" (పేజి 52)

స్వయంవరంలో నేటి సుకుమారి వాక్కులు ఎంతటి హాస్యస్ఫోరకములుగా నున్నవో......

"ఈ మగడు నాకొద్దు
వీడసలే తుమ్మమొద్దు
గడ్డంమీసాలకన్న
గడ్డిపారలేకా స్తనయం"

వీడిపుట్టుకే దేశానికరిష్టం
బలవంతంగా తాళి కట్టించకు
......
నారదుడు చెప్పగా విన్నాను నిన్న
వీడి ఆయుర్దాయం రేపటితో నిండుసున్న
వీడా సత్యవంతుడుకాదు
అందుకే నేను సావిత్రిలా నటించలేను
యముడుమునుపటంత
ధర్మరాజు కాదు
మగడి ప్రాణాలు మళ్లీ ఇవ్వడానికి
తెగించి వెంటపడితినా
యమునితో లేచిపోయిందంటుంది లోకం
అదంతా ఔటాఫ్ డేట్" (పే. 36)

నేటి రాజకీయాల్లో రాక్షసత్వం ఎలావుందో తెలుపుతున్నారు.

"వేష భాషల్లో ఏ మాత్రం
కసాయితనం కనిపించదు"

దారితప్పి ఈలోకం వచ్చిన
గాంధర్వులవలె కనిపిస్తారు.

వాళ్ళూ మన తోబుట్టువులే
ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు
భారతీయ జనులు కండ్లు తెరవాలయా
విశ్వదాభిరామ వినుర వేమ." (పే.40)

బ్రహ్మంగారి కాలజ్ఞానాన్ని, ప్రజా కవివేమన శతకాన్ని మరోసారి చదివేలా చేస్తున్నారు

"ది గ్రేట్ ఇండియన్ సర్కస్" (పే 48)

వ్యంగ్యప్రధానమైన శిల్పరచనా ప్రాధాన్యత భాసించుతున్నది.

అఖిలభారత జంతు సమ్మేళనంలో ఆయా జాతి జంతువులు తమ కోర్కెల తీర్మానాన్ని ప్రవేశ పెడు తున్నవి. సభకొనసాగుతున్నది.

అప్పటిదాకా నిదురిస్తున్న పందిలేచి
"దైవాంశ సంభూతులమూ
దశావతారాల్లో ఖ్యాతిగన్న
మాసంగతే సభవారికి
పట్టనట్టున్నదని ఘుర్ఘురిస్తూ
భూగోళం నుద్ధరింప
ప్రజాసేవకోసం పుట్టినాము
మూతిమీద మీసమున్న
మొనగాడెవ్వడు మాతోసరి
గడ్డితినే జంతువులకు
గుళ్లనుకాపాడే బలమేమున్నది?
కనుకనే శివాలయాల్లో
నందివిగ్రహాలు తొలగించి
పందివిగ్రహాలు ప్రతిష్టించాలప్పుడు,
......

అనిహఠాత్తుగా తీర్మానం ప్రవేశ పెట్టిందంటూ ఎన్నికల్లో నెగ్గిన కొందరినాయకుల ఆలోచనా సరళిని కన్నులకు కట్టేలా తెలిపినారు.

అపరిష్కృత సమస్యల శరపరంపరలు. ఏ సమస్య తీరదీదేశంలో.... "మహమ్మారి" కవితలో

ఈ పాముచావదు
అథవా కట్టైనావిరుగదు
ఈ రోగం నయం కాదు
పోనీ చావైనా రాదు
......
నాడిఆడదం లేదు
కండ్లు మూతపడడం లేదు.
పాపం కప్పుదామన్న
దుప్పటిచాలడం లేదు
ఉన్నదానికే చిల్లులు మెండు
చుట్టూరా నల్లులదండు" (పే.68)

"మరణశాసనం"లో మహానాయకుల స్వార్థ చింతనం ఎలాగూడు కట్టుకొని వుంటుందో స్పష్టం చేశారు. "ఉగాదిపాటలో మనిషిలో మానవత వికసించాలని కోరుతున్నారు.

"భవిష్యద్గీత" లో నేటివ్యవస్థ
పిచ్చెక్కిన కుక్కతో పసిపిల్లవాడు
సయ్యాట లాడినట్లుంది.

రేపు వాగులూ వరదలూ తగ్గినాక
ఈ నేలంతా సమతలంగా మారుతుంది
రేపు నవగ్రహాలన్నీ కలిసి
అనుకూలకక్ష్యలో ప్రవేశిస్తాయి
అంతవరకు గుడ్‌నైట్" (పే 70)

అంటూ సమాజంలో అసమానత తొలగిపోయి సమసమాజస్థాపనా ముహూర్తము చేరువలోనే వుందని అభివ్యక్తం చేస్తున్నారు.

"అదేదో ముందుకనిపెట్టాలి
కాలాన్ని బతికించు కోవాలి
కాలాంతకున్ని ఖతం చేయాలి"

—శిలం రాజేశం

# ప్రాచీన భారతీయ విజ్ఞానవము

(ప్రథమ భాగము) వెల-20-00.
రచన :- శ్రీ రాణీ శ్రీనివాసశాస్త్రి
ప్రాప్తిస్థానం. భారతీయ రసాయనశాలా
సత్యనారాయణపురము,
విజయవాడ-520011.

నేటి మన దేశ-దుస్థితి చూచి, జాలిపడి, మన భారత దేశౌన్నత్యము మేమిటో ప్రజలకు తెలియ

పరచు ఉద్దేశ్యముతో ఈ గ్రంథము వ్రాసినట్లున్నది. ఒకనాడు భారతదేశము జగద్గురు స్థానమున తేజరిల్లి నది. కాలక్రమేణ ఆ తేజం తగ్గిపోయినది. పాశ్చాత్య విద్యవల్ల మనకు కొంచెముమేలు జరిగినది. కాని, అది మోతాదు పెరిగి వ్యామోహంగా పరిణమించింది. ప్రతి చిన్న విషయానికి పాశ్చాత్యులే శరణ్యమయ్యే టంతవరకు పరిస్థితి దిగజారిపోయింది. నేటివిజ్ఞాన వికాసానికి వారే మూలకారకులని మనవారు శుద్ధ ఛాందసులైన అవివేకులని కొందరు కంఠోక్తిగ అంటు న్నారు. అట్టివారీ గ్రంథము తప్పక చదవాలని కోరు చున్నాము.

వేదములు సనాతనములు. అందు విజ్ఞానము అడు గడుగున వెల్లివిరిసి ఉన్నది. అయితే అవి చాల మందికి తెలియవు- శ్రీ శాస్త్రిగారు ఎన్నో ఆశ్చర్యకర మైన విజ్ఞాన విషయాలు వేదప్రమాణములతో ఇందు వ్రాసినారు- ఇవి చదివి ఆనందించ వలసిందేకాని వ్రాయుటవలను పడదు- ఉదా :-

(1) వేదాలలో ఈనాటి సైన్సు చూడండి :-
ఆయంగౌః ప్రశ్నిరక్రమీదసనన్మాతరంపురః
పితరంచ ప్రయన్త్స్వః

ఇతి ఋగ్వేదం-10-189-1యజుర్వేదే 1-5-3-2 ఈ భూమిచుట్టూ చంద్రుడూ, సూర్యునిచుట్టూ భూమి తిరుగుచున్నదని వేదాలలో చెప్పియున్నది. ఈ విషయం తెలియని కొందరు భారతీయులు పదిహేడవ శతాబ్దిలో గెలీలియో అను ఇటలీ దేశస్థుడు సూర్యుని చుట్టూ భూమి తిరుగుచున్నదని కనిపెట్టినాడందురు. అంటే 350 సం॥ పూర్వము వరకు సూర్యునిచుట్టూ భూమి తిరుగుచున్నదన్న జ్ఞానము మనకు లేదని నేటి పెద్దల అభిప్రాయము.

(2) శ్రుతిః :- త్రినాభి చక్రమజరమనర్వంయేనేమా
విశ్వాభువనాని తస్థుః ।
ఋగ్వేదం-1-164. సూక్తము 2
యజుర్వేదం-3-28. పనస.

తా॥ ఈ బ్రహ్మాండములోని భూమి, సూర్యుడు, చంద్రుడు. నక్షత్రములు మొదలగు సమస్త గోళములు దీర్ఘవృత్తములో తిరుగుచున్నవి- ఇదితెలియని మనవారు 17వ శతాబ్దంలోని "కేప్లేర్ జోహాన్నేస్" అను శాస్త్రజ్ఞుడు దీర్ఘ వృత్తములో సమస్తగోళములు తిరుగుచున్నవని కనిపెట్టినాడందురు, ఎంతటి అజ్ఞానమో !

(3) శ్రుతి
అ) దాదర్థ పృథివీమభితోమయూఖైః ।
ఇతియజురారణ్యకె-1.8-28.
ఆ)
మిత్రోదాధారపృథివీముతద్యాం।మిత్రః కృష్టీ,
కృష్ణయజుర్వేదే—3-4-11-16

తా॥ ఈ భూమిని సూర్యుడు అన్ని దిశలనుండి ధరించియుండెను. భూమికి సూర్యుడు ఆకర్షకుడు అని మన వేదము స్పష్టముగ చెప్పుచుండగా 18వ శతాబ్దములోని న్యూటన్ సర్ ఇజాక్ అను ఆంగ్లే యుడు ఇదికనిపెట్టినాడనుట మన భారతీయ విద్యా గంధము లేకపోవుటయే గదా!

(4) హాలీ ఎడ్మెండ్—

అను ఆంగ్లేయుడు తోకచుక్కలను కనుగొన్నాడట ఏ రెంటినో మూడింటినో!! మన భారతీయ గ్రంథము లగు క్రియాసార తంత్రములోను బృహద్విమాశ శాస్త్రములోను, శక్తితంత్రములోనూ, ఖేటసర్వ స్వము మొ॥ గ్రంథములలోనూ, భరద్వాజ, అగస్త్య జైమినీ, మొదలగు ఋషులు కో ట్లలుగా గల ఈ తోక చుక్కలనూ, వాటిపేర్లనూ, ప్రయోజనములనూ అందుండి విద్యుత్తులను గ్రహించు వివిధ, విషయ ములను తెలిపిరి.

శ్లో॥ బాణస్థధూమ కేతూనాం।
మండలస్యాష్టమాంతరే।
త్రికోటి సప్తలక్షత్రి!
సహస్రద్విశతోపరి॥

ఏక వింశతి సంఖ్యాకాః।
వర్తంతే ధూమకేతవః।
విద్యుద్గర్భా స్తేషు ధూమ।
కేతవోష్ట సహస్రకాః॥ ఇత్యాది॥

ఆకాశమందు ఎనిమిదవ మండలములో 3 07,03 221 (మూడుకోట్ల ఏడులక్షల, మూడువేల, రెండు వందల యిరువదొక్క) తోకచుక్కలుగలవు

ఇందులో భయంకరమైన తోకచుక్కలు— మహా కాలాది తోకచుక్కలు— ఎనిమిదివేలు గలవు. ఇందు విద్యుత్తును సరాఫరాచేయగల తోకచుక్కలు పండ్రెండు మాత్రమే గలవు- రోచిషా, దాహకా,సింహీ మొదలైన విద్యుత్ప్రధాన మగు తోక చుక్కల పేరులు

ఇట్లా ఈ ఉద్గ్రంథమందు అత్యాశ్చర్యకరమైనవి ఎన్నోగలవు. అణుసిద్ధాంతము గూర్చిన విషయము ముఖ్యంగా పరమాణును చూచు భూతద్దమును గూర్చిన భారతీయ విజ్ఞానం చాల గొప్పగా నున్నది అట్లేఆయస్కాంతము, పరిణామవాదము (డార్విన్ మొ॥) విమాన శాస్త్రము ఇత్యాదులు ఆశ్చర్య కరముగనున్నవి. ఇంకా, శ్రీ బ్యాకన్ రోగర్, శ్రీ డాల్టన్ జాన్, శ్రీ పాశ్చర్‌టా ఇస్ ఇత్యాది పాశ్చాత్యులు ఏమేమి, కనిపెట్టినారో చెప్పి అవి భారతీయ ఆర్షగ్రంథములో ఎంత విశదముగ ఎంత సూటిగా స్పష్టంగా చెప్పబడినవో, ఆయా మంత్రములు, స్మృతులు సూత్రములు మొదలగు ప్రమాణములతో చక్కగ వివరించబడినవి- చదివిని ప్రతివారూ ఆశ్చర్య పడవలసినదే! వైజ్ఞానిక విషయములు మన వేదాల్లో శాస్త్రాల్లో ఎంత చక్కగ వివరించబడినవో, వ్రాయవలను పడవు. శ్రీ శాస్త్రిగారి కృషి చాలా ప్రశంసనీయమైనది. ఈకృషికి తగిన చేయూత లభించిన, అది ప్రమోజన మూలమై దేశము అద్వితీయశక్తి సంపన్నమై ఆలరారగలదు.

ఈ గ్రంథము చదివి భారతీయ విజ్ఞానమును వ్యాపింప చేయవలెనని పీట్లపయి పరిశోధనలు సలిపి భారత దేశౌన్నత్యమునకు ప్రతివారు క్రియాశీలురు కావలెనని కోరుచున్నాము.

తంగిరాల

# వార్తావాహిని

## హిందీ స్నాతకోత్తర కాంప్లెక్స్
## దక్షిణ భారత హిందీ ప్రచార సభ

29 మె 84 ఆదివారం సాయంకాలం 6 గంటలకు దక్షిణ భారత హిందీ ప్రచార సభ (ఆంధ్ర) ప్రాంగణంలో పోస్టు గ్రాడ్యుయేట్ అండ్ రిసర్చ్ కాంప్లెక్స్ వార్షికోత్సవము జరిగినది. శ్రీ గోపాల్‌రావు ఎక్బోటే గారు అధ్యక్షత వహించారు.

హిందీ స్నాతకోత్తర కాంప్లెక్స్ రిజిస్ట్రార్ శ్రీ వేమూరి ఆంజనేయశర్మ అతిథులకు స్వాగతం చెబుతూ ఈ సంస్థలో అనుసరింపబడుచున్న పాఠ్యక్రమ వివరాలను గురించీ, హిందీ భాష సాహిత్యాల అధ్యయనంతో బాటు ప్రయోజనాత్మకమైన పాఠ్యక్రమాన్ని గురించీ వివరంగా తెలియ చేశారు. డాక్టర్ దిలీప్ సింహ్ పాఠ్యక్రమ వివరాలను, సంస్థ కార్య కలాపాలను విశదంగా తెలియ చేశారు. సభకు ముఖ్య అతిథిగా విచ్చేసిన డాక్టర్ దాశరథి గారు సంస్థ పాఠ్యక్రమంలో సాహిత్యంతో బాటు భాషా విజ్ఞానానికీ, ప్రయోజనాత్మకమైన హిందీకీ ప్రాముఖ్యం కల్గించడం సంతోష దాయకమైన విషయం అన్నారు. ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు రాజభాషగా నిర్ణయించబడింది. కాని కార్యాలయాలలో ఉపయోగానికి తగిన తెలుగు శబ్ద నిర్మాణము, రచనా విధానము రూపొందించబడటం అవసరమన్నారు. ఈ స్నాతకోత్తర కాంప్లెక్స్ కృషి చేయడం ముదావహమని అన్నారు. హిందీ మిలాప్ సంపాదకులు శ్రీ యుద్ధవీర్ గారు భారతీయ భాషల మధ్య విభేదాలను సృష్టించి ఇంత వరకు ఇంగ్లీషే రాజ్యం చేస్తూ వచ్చిందనీ ఆస్థానాన్ని భారతీయ భాషలకు లభించే ప్రయత్నం జరగడం అవసరమనీ, విశ్వవిద్యాలయ స్థాయిలో ద.భా. హిందీ ప్రచార సభ ఈ కాంప్లెక్స్ ద్వారా కృషి ప్రారంభించడం సంతోషదాయకం అన్నారు. శ్రీ గోపాల రావు ఎక్బోటే గారు రాజ్యాంగ చట్టంలో నిర్దేశించిన సూత్రాలను బట్టి భారతీయ భాషలన్నింటి అభివృద్ధికి తోడ్పడ వలెననీ, ప్రస్తుతం మన దేశంలో ఇంగ్లీషు భాషకు ప్రాధాన్యానిచ్చి భారతీయ భాషల విషయంలో ఉదాసీనంగా వుండే దృష్టి ఏర్పడిఉన్నదని ఆ దృష్టి మారడం అవసర మనీ అన్నారు.

ఈ సందర్భంలో కాంప్లెక్స్ విద్యార్థినీ విద్యార్థులు విభిన్న కళలలో తమకు గల అభిరుచిని వ్యక్తం చేస్తూ తెలుగు హిందీ జానపద గీతాలు, జానపద నృత్యం కవాలీ మొదలగునవి ప్రదర్శించారు ఉపేంద్రనాథ్ అశ్క్ రచించిన "ఇత్ నీ సీ బాత్" ఏకాంకికను ప్రదర్శించారు.

"భారతీయ సంస్కృతి ప్రకారం సహ విద్యాభ్యాసం" అన్న విషయంపై జరిగినఉపన్యాసపోటీలో శ్రీమతి సాకిహీఉస్మానీ (సెమిస్టరు) మొదటి బహుమతి శ్రీ బి. వెంకటేశ్వర రావు రెండవ బహుమతిని శ్రీ భంవరీ లాల్ శర్మ మూడవ బహుమతిని గెల్చుకున్నారు. ప్రదర్శించిన నాటికలో ఉత్తమ నటుడుగా శ్రీ సత్యనారాయణ (111 సెమిస్టరు) ఉత్తమ నటిగా కుమారి రమాకుమారి (11 సెమిస్టరు) బహుమతులు గెల్చుకున్నారు. శ్రీ భవంరీ లాల్ శర్మకు ప్రత్యేక బహుమతి యివ్వబడినది.

వాద్యసంగీతంలో శ్రీ గోపాల కిషన్ (1 సెమిస్టరు మరియు జానపద గీతాలకు శ్రీ కృష్ణప్రసాద్ లకు బహుమతులు లభించాయి. శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ గారు బహుమతి ప్రధానం చేశారు.

డాక్టర్ దిలీప్ సింహ్ వందన సమర్పణ చేయగా జాతీయ గీతంతో కార్యక్రమము ముగిసింది.

## ప్రమాణపత్ర వితరణోత్సవము

ది. 19. 4. 84 గురువారం సాయంత్రం 5. 30 గంటలకు జిల్లాపరిషత్ హైస్కూలు పచ్చల తాడిపర్రులో 1983 ఆగస్టులో ఉత్తీర్ణులైన ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రభాష విద్యార్థుల ప్రమాణపత్ర వితరణోత్సవము శ్రీ దాసరి శ్రీరాములుగారి ఆధ్వర్యమున జరుపబడినది. అధ్యక్షులవారు ఉత్తమ పౌరులుగా పెరిగి దేశఖ్యాతిని పెంచవలసినదిగా విద్యార్థులను కోరిరి. స్థానిక హిందీ ప్రచారకుడు, హిందీ ప్రచారసభ యొక్క జీవిత సభ్యుడు అయిన శ్రీ కె. సీతారామయ్యగారు సభ యొక్క చరిత్రను సంగ్రహముగా వివరించి సభవారు నడుపుచున్న స్వర్ణోత్సవ హిందీపరిచయ పరీక్షకు ఎక్కువ సంఖ్యలో కూర్చోని సభాకార్యక్రమములను జయప్రద మొనర్చవలసినదిగా కోరిరి. స్థానిక హిందీ ప్రచారకురాలు కుమారి షేక్ మరియంబీ హిందీ నేర్చుకొనవలసిన ఆవశ్యకత గురించి చెప్పిరి. జాతీయ గీతాలాపనతో సభముగిసినది. సభానంతరం పిల్లలకు బిస్కత్తులు పంచిరి.

## హిందీప్రచారక విద్యాలయం, తెనాలి

ది. 7. 5. 84న తెనాలి హిందీ ప్రేమీమండలిలో హిందీ ప్రచారక విద్యాలయ ప్రశిక్షణార్థుల వీడ్కోలు ఉత్సవం శ్రీ వెలువోలు సీతారామయ్య (మండలి అధ్యక్షులు) గారి అధ్యక్షతన జరిగినది. ప్రచారక విద్యాలయ స్థాపకులు వ్యవస్థాపకులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావుగారు స్వాగతంపలికి అతిథులను సభికులకు పరిచయం చేశారు.

హిందీ ప్రచారక విద్యాలయ ప్రిన్సిపాల్ కుమారి యస్. టి. వసంతగారు నివేదిక సమర్పించినారు.

ముఖ్యఅతిథి శ్రీ వి. ఆర్. చంద్రశేఖర్, ప్రధాన కార్యదర్శి, దక్షిణ భారత హిందీ ప్రచారసభ,మద్రాసు ప్రచారక విద్యాలయ విద్యార్థుల హస్తలిఖిత పత్రికను ఆవిష్కరించి సుశిక్షణతోకూడిన విద్యాలయ వ్యవస్థను శ్లాఘించారు

సభ విద్యాకార్యదర్శి శ్రీ జె. మార్గబంధుగారు హిందీభాషప్రచార ప్రాశస్త్యాన్ని వివరించి, ప్రశిక్షణార్థులకు ఉజ్వల భవిష్యత్తు కలగాలని శుభాకాంక్షలు తెలియజేశారు.

శ్రీ శాఖమూరి వెంకటామయ్య, ప్రిన్సిపాల్, వి. యస్. ఆర్. & యన్. వి. ఆర్ కాలేజి. తెనాలి హిందీ భాష ఉత్తరదక్షిణ భారతాలకు సారధి వంటిదని, అఖిల భారతీయ ప్రయోజనాలకై హిందీ నభ్యసించుట అవసరమని నొక్కివక్కాణించారు.

తెనాలి కె. యల్. యన్. సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ మైలవరపు శ్రీనివాసరావుగారు సంస్కృత హిందీ భాషల అనుబంధాన్ని వివరించారు

శ్రీ తంగిరాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు కార్యవాహి కార్యదర్శి, దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర ప్రసంగిస్తూ - విదేశాలపై మోజు పెరుగుతున్న యీ తరుణంలో మన విద్యావిధానంలో మౌలికమైన మార్పురావడం అవసరమని, సత్శీలం సౌజన్యాన్ని పెంచే సద్విద్యను గరుపుతూ, ప్రయోజనాత్మకమైన హిందీశిక్షణయిచ్చుట అవసరమని అన్నారు. వారుతమ ప్రసంగంలో తాను ఆంధ్రలో ప్రత్యేకతను సంతరించుకొన్న యీ ప్రచారక విద్యాలయ పూర్వ విద్యార్థినని, ఇచ్చటి సుశిక్షణ క్రమశిక్షణను శ్లాఘించి తమ కృతజ్ఞతను వెల్లడించారు.

ప్రశిక్షణార్థులు పి. శ్రీనివాసరావు, చాంద్‌దాషా, కూనిశెట్టి పద్మప్రసూన, వెలగా వెంకటేశ్వరమ్మ,

కె. సాంబశివరావు తమ అనుభవాలను వివరించి కృత జ్ఞతలు తెలియజేశారు.

వక్తృత్వ లేఖన సంగీత వివిధ ఆటల పోటీలలో గెలుపొందిన వారికి శ్రీ చంద్రశేఖర్ బహుమతులంద జేశారు.

ప్రచారక విద్యాలయం తరపున శ్రీ వి. ఆర్. చంద్రశేఖర్, శ్రీ జె. మార్గబంధు, శ్రీ టి. సుబ్రహ్మణ్యశాస్త్రిగార్లను కాశ్మీరు శాలువతో సత్కరించారు.

అధ్యక్షులు తమ అంత్యోపన్యాసంలో గాంధీజీ కలలుగన్న రామరాజ్యంలో, నేటి యువకులు రేపటి పౌరులు గనుక తాము నేర్చిన ఆదర్శాలు ఆశయాలను ఆచరించుట ద్వారా ఆదర్శ పౌరులు గావాలని అభిలషించారు.

కుమారి బి. అన్నపూర్ణ వందన సమర్పణ గావించారు. సభానంతరం విద్యార్థులచే వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు విజ్ఞాన వినోదాత్మకంగా ప్రదర్శించబడినవి.

## హిందీ ప్రేమీ మండలి హైదరాబాద్ రజత జయంతి ఉత్సవము

ది 1-4-1984 ఉదయం 9 గంటలకు దక్షిణ భారత హిందీ ప్రచార సభ- ఆంధ్ర ఖైరతాబాద్ కార్యాలయ భవనమందు మండలి అధ్యక్షులు శ్రీ చవాకుల నరసింహమూర్తిగారి అధ్యక్షతన కార్య నిర్వాహక సమితి ప్రత్యేక సమావేశము జరిగినది.

1984 జూన్ నెల రెండవ వారంలో మండలి రజత జయంతి ఉత్సవము జరుపుటకు నిర్ణయించడ మైనది

శ్రీ టోకర్సీ లాల్ కపడియా గారిని స్వాగత సమితి అధ్యక్షులుగా, శ్రీ వేమూరి అంజనేయశర్మ గార్ని శ్రీ యుద్ధవీర్ గార్ని స్వాగత సమితి ఉపాధ్యక్షులుగా శ్రీ పి. వి రాజేశ్వరరావు గార్ని కార్యదర్శిగా శ్రీ గోదా తిరుమలయ్య శ్రీ జి మహేశ్వర రావు సహ కార్యదర్శులుగా ఏకగ్రీవముగా ఎన్నికొనబడినారు.

ఈ సందర్భమున రజత జయంతి స్మారక సంచికను ప్రచురించుటకు నిర్ణయించబడినది.

(1)రు 1001=00 విరాళము యిచ్చిన వారిని మహా పోషకులుగా

(2)రు 116=00 ఇచ్చిన వారిని పోషకులుగా

(3)రు 11=00 ఇచ్చినవారిని స్వాగత సాధారణ సభ్యులుగా చేర్పించుటకు నిర్ణయించడ మైనది.

హిందీ అభిమానులను స్వాగత సభ్యులుగా చేరి రజత జయంతి ఉత్సవమును విజయవంతము చేయ వలసిందిగా కోరడమైనది.

## అభినందన సభ

ప్రొ. రవీంద్రనాద్ శ్రీవాత్సవ్ భాషావిజ్ఞాన విభాగం ఢిల్లీవిశ్వవిద్యాలయం) గౌరవార్థమై కీ 24-5-84 నాడు దక్షిణ భారత హిందీ ప్రచార సభవారి ఉచ్చ శిక్ష అవుర్ శోధ సంస్థాన్‌లో సభ జరిగింది. ప్రొ. శ్రీ వాత్సవకు స్వాగతం చెబుతూ సంస్థ రిజిస్ట్రారు శ్రీ వి. ఆంజనేయ శర్మ శ్రీ వాత్సవ గారి సహాయ సహకారాలతో నిర్ధారింపబడిన పాఠ్యక్రమాలను గురించి సంక్షేమంగా చెబుతూ ప్రస్తుతం ఈ కాంప్లెక్స్‌లో బోధింపబడుతున్న భాషా విజ్ఞానం ప్రయోజన మూలక హిందీ మరియు యితర భాషా సంబంధమైన పాఠ్య క్రమాలకు మంచి ఆదరణ లభిస్తోందని దిన దినానికి వృద్ధి చెందుతున్న విద్యార్థుల సంఖ్య యిందుకు నిదర్శనమని అన్నారు. సంస్థ చేపట్టిన

కార్యక్రమాల గురించి సాధించిన విజయాల గురించి చెప్తూ ప్రొ. శ్రీ వాత్సవ సంస్థ ప్రచురించిన మూడు పుస్తకాలను డిల్లీ విశ్వవిద్యాలయం పాఠ్యపుస్తకాలుగా స్వీకరించిందని అది సంస్థకు ఎంతో గర్వకారణమైన విషయమని అన్నారు. అంతే కాక సంస్థ ప్రయోజన మూలక హిందీ, భాషా శిక్షణ, అనువాద సమస్యలు మొదలైన రంగాలలో విద్యార్థులచే పరిశోధన చేయించమని ప్రోత్సహించారు. అలాగే వర్క్‌షాప్‌లను రిసర్చ్ ప్రాజెక్టులను ఏర్పాటు చేసినట్లయితే దక్షిణ ప్రాంతంలో హిందీ ప్రచారంలో గల సమస్యలు లోటుపాట్లు తెలిసివస్తాయని సూచించారు. ప్రొ జగన్నాథన్ (కేంద్రీయ హిందీ సంస్థాన్) ఉచ్చ శిక్ష శోధ సంస్థలో బోధింపబడుతున్న పాఠ్యాంశాలను మెచ్చుకుంటూ వర్క్‌షాప్‌లను రిసర్చ్ ప్రాజెక్టులను ఏర్పాటు చేయడంలో సహకరించేందుకు తమ సంసిద్ధతను వెల్లడించారు. చివరకు సంస్థ రీడర్ డా దిలీప్ సింగ్ ధన్యవాదాలు తెలుపుతూ ప్రొ శ్రీవాత్సవ సూచనలను అనుసరించి యిక్కడ కొనసాగుతున్నటువంటి కార్యాలను గురించి సంక్షేమంగా చెప్పారు.



# దక్షిణ భారత హిందీ ప్రచారసభ-ఆంధ్ర

## (పరీక్షా విభాగము)

## హిందీ ప్రచారకులకు మనవి

మే. 1984 స్రవంతి ద్వారా ప్రచారకులకు కొన్ని సూచనలు తెలియ జేయబడినవి. వాటి తరువాత మరి కొన్ని సూచనలు యీ క్రింద పొందుపరచు చున్నాము. వీనిని కూడ గమనించ వలసినదిగా ప్రచారకులకు మనవి.

### *4*. ఆవేదన పత్రములు నింపుట

1. పరీక్షార్థులు పరీక్షా ఆవేదన పత్రములను నింపునపుడు కొన్ని తప్పులు పొరపాటుగా చేస్తూ వుంటారు. ప్రచారకులు ఆవేదన పత్రములు పంపాలనే తొందరలో క్రిందసంతకం చేస్తారే గాని పైన పరీక్షార్థి తనపేరు, తండ్రిపేరును, చిరునామా సరిగా వ్రాశాడో లేదో గమనించరు. పరీక్షార్థులు ఆవేదనపత్రమునందు పరీక్షార్థి కా నామ్' అను కాలమునకు ఎదురుగా బడిలో తనపేరు యే విధంగా వ్రాయబడిందో అదే పేరును యిక్కడ నింపాలి ఆట్లాగే 'పితా కా నామ్' ఎదురుగా తమ తండ్రిగారినడిగి వారి అసలు పేరును మాత్రమే నింపాలి. కొందరు తన మరియు తండ్రిపేర్లు వ్రాయునపుడు యింటిలోను, బయట వాడుకగా పిలువబడు పేర్లను వ్రాస్తారు. ఇందు వలన పై పరీక్షలకు వెళ్ళినపుడు, ఉద్యోగానికి హిందీ ప్రమాణ పత్రము పంపునపుడు యిబ్బందులు వస్తాయి. కావున పరీక్షార్థులు వ్రాసిన పేర్లు సరుయైనవీ లేనివీ ప్రచారకులు ఒక్కసారి సరిచూస్తే బాగుంటుంది. అంతేగాక 'ప్రాదేశిక భాష' లోను 'దేవనాగరి'లోను వ్రాసే ఒకే పేరులో మార్పులు కనిపిస్తుంటాయి ఉదా: 'కామాల్ జైరియాజ్ అలీ ఖాన్'అని తెలుగులో వ్రాసి దేవనాగరిలో 'కామాల్ జైరియాజ్ అని మాత్రమే వ్రాస్తాడు పరీక్షార్థి. సంతకం కె. రియాజ్ అని చేస్తాడు. ఇతని ప్రమాణ పత్రంలో యే పేరు వ్రాయాలి? ఇటువంటి సమస్యలనుండి ముక్తి పొందాలంటే ప్రచారక బంధువులు దరఖాస్తులు పంపుటకు ముందు ఒక్కసారి పరీక్షార్థి దరఖాస్తును సరిగా నింపాడా లేదా? నింపిన దానిలో అక్షరదోషాలేమైన వున్నాయా? వీనిని సరి చూచి తప్పులున్న వాటిని సరిదిద్ది పంపాలి.

*4*.(*2*). ఇక 4వకాలం చిరునామా. కొందరు ఈ చిరునామా కాలం కూడా నింపాలా? అన్నట్లు తోచినరీతిలో నింపి పంపుతారు. అసలు దరఖాస్తులోని ప్రతి కాలము తప్పక సరిగ్గానింపాలి. చిరునామా సరిగ్గా లేకపోతే పరీక్షార్థికి యేదైనా తెలియ పర్చాలంటే కష్టం చిరునామా కాలములు రెండు వుంటాయి. రెంటినీ తప్పక నింపాలి. 4వ కాలం నందలి చిరునామా సభ రికార్డులో వుంటుంది. 9వ కాలం నందలి చిరునామా మార్కుల కార్డుకు అందించబడుతుంది. ఇది కనుక సరిగా నింపక పోయినట్లయితే మార్కుల కార్డు పరీక్షార్థికి అందదు. ఈ కారణంగా అపోహలు యేర్పడుతాయి. కావున ప్రచారకులకు మనవి యేమిటంటే ఈ రెండు- 4 మరియు 9, కాలంలను చక్కగా నింపించ ప్రార్థన.

*4* (*3*). 'పరీక్షా కేంద్రం' అనుకాలమునందు కేంద్రము పేరు మాత్రమే వ్రాయాలి. అంతేగాని పరీక్ష నడచు పాఠశాల పేరు వ్రాయకూడదు.

### *5*. ఆవేదన పత్రములు, పరీక్షా శుల్కము:

1 ఆవేదన పత్రములు, పరీక్షా శుల్కము ఒకేసారి నిర్ణయించ బడిన తేదీలోగా సభకు చేరునట్లు పంప

వలెను నిర్ణయించబడిన తేదీ తరువాత పంపబడు ఆవేదన పత్రములు గాని, పరీక్షా శుల్కము గాని అంగీకరించబడవు.

*5.(2)*. ప్రచారకులు పరీక్షాశుల్కము రూపమునపరీ క్షార్థుల నుండి వసూలు చేసిన సొమ్మును ఏదేని బ్యాంకు డి.డి. రూపములో గాని పోష్టలు ఆర్డరు రూపమున గాని పరీక్షా ఆవేదన పత్రములకు జతపరచి పంప వలెను. వేరు వేరుగా పంప వలదు, 15వ తేదీ (జూన్ లేక డిసెంబరు)వరకు వసూలు చేసిన ఆవేదన పత్ర ములు, పరీక్షా శుల్కము ఒకేసారి పంపవలెను. పరీక్షా శుల్కము వేరుగాను ఆవేదన పత్రములు వేరుగాను పంపినందువలన కొన్ని యిబ్బందులు కలుగును. కావున రెంటినీ ఒకదానితో నొకటి జతపరచి పంప వలెను.

*5.(3)* విలంబ శుల్కముతో, 15వతేదీతరువాత పంపు ఆవేదన పత్రములు, శుల్కము ఒకేసారి నిర్ణ యించబడిన తేదీ 25 (జూన్ లేక డిసెంబరు)లోగా సభకు అందునట్లు పంపవలెను.

*5.(4)*. కొందరు ప్రచారకులు వారిద్వారాపరీక్షకు కూర్చుండ బెట్టబడు మొత్తం విద్యార్థుల పరీక్షా శుల్కమునకు ఒకేసారి 15వ తేదీ లోగా బ్యాంకు డి.డి. తీసికొందురు. ఆవేదనా పత్రములను మాత్రము 25వ లేక 30వ తేదీ వరకు తీసుకొంటూ పోయి అను కున్న సంఖ్య పూర్తి అయిన తరువాత ముందుగానే (విలంబ శుల్కము లేకుండా) తీసివుంచిన బ్యాంకు డి.డి.తో జతచేసి పంపుతున్నారు. అవి మాకు విలంబ శుల్కముతో అంగీకరించు తేదీలలో చేరుట కారణంగా వాటికన్నింటికీ విలంబ శుల్కము- బాకీశుల్కము రూపమున వసూలు చేయవలసి వచ్చుచున్నది. లేని యెడల ఆడిటర్లు అభ్యంతర పెట్టెదరు. కావున ప్రచా రక బంధువులు విలంబ శుల్కము లేని ఆవేదన పత్ర ములు, పరీక్షా శుల్కము వేరుగానూ, విలంబ శుల్క ముతో కూడిన ఆవేదన పత్రములు, పరీక్షా శుల్కము వేరుగానూ పంప ప్రార్థన.

*5 (5)*. పైన తెల్పిన క్రమములో పంపని కార ణంగా ఆయా ప్రచారకుల నుండి బాకీ శుల్కము రావలసినట్లు సభ లెక్కలలో చూపబడి తరువాత వారి పరీక్షార్థుల పరీక్షా ఫలితములు నిల్పి (with hold) వేయబడుచున్నవి. కావున శ్రమ యని భావిం చక ప్రచారకులు పరీక్షా ఆవేదన పత్రములు, శుల్కము పంపునపుడు పైన (5.2,5.3 లలో, తెల్పిన క్రమము ననుసరించ ప్రార్థన.

## *6* పేరు మార్పు

1. పేరా 4. 1 నందు తెల్పినటుల పరీక్షార్థులు తమ తమ తండ్రి పేర్లు సరిగా వ్రాయని కారణంగా రాష్ట్రభాష పరీక్షయందు కొన్ని యిబ్బందులు యెదు రవుతున్నాయి. రాష్ట్రభాషపరీక్ష ఆవేదనపత్రం పంపే టప్పుడు తాము చేసిన తప్పు తెలుసుకొని అసలు పేరు వ్రాస్తారు. మధ్యమ ఉత్తీర్ణత ననుసరించి రాష్ట్రభాష పరీక్షకు అనుమతి యివ్వబడుతుంది. కావున పేరులో మార్పు వచ్చేటప్పటికి తాత్కాలికంగా అతనిని పరీక్ష వ్రాయుటకు అనుమతి యివ్వ బడుతుంది. పరీక్షా ఫలి తములు ప్రకటించేలోపుగా అతని నుండి పేరు మార్పు నకు సంబంధించి సరైన వివరణ వచ్చినట్లయిన అతని పరీక్షా ఫలితములు ప్రకటించ బడతాయి. లేని యెడల అవి నిల్పివేయ (with hold) బడతాయి.

*6 (2)* ఇదేవిధంగా మధ్యమ పరీక్షయందు ఉత్తీ ర్ణుడై ఆ వివరణను రాష్ట్ర భాష పరీక్ష ఆవేదన పత్రమునందు సరిగా నింపని పరీక్షార్థుల పరీక్షా ఫలి తములు కూడ నిల్పి వేయబడతాయి.

*6.3.* నేరుగా రాష్ట్ర భాష పరీక్ష వ్రాయుటః ఇందుకు సంబంధించిన 'ఛూట్' నియమములు మే 84 స్రవంతి సంచిక టైటిల్ 4వ పుట యందు యివ్వ బడినవి. నియమ ప్రకారము 'ఛూట్' అనుమతి పొంద కుండా రాష్ట్ర భాష పరీక్ష వ్రాసిన పరీక్షార్థుల పరీక్షా ఫలితములు నిలిపివేయ బడగలవు. కావున నేరుగా రాష్ట్ర భాష పరీక్ష వ్రాయదలచినవారు నియమముల ననుస రించి ముందుగానే సభనుండి అనుమతి పొంది ఆ అనుమతి పత్రమును రాష్ట్ర భాష ఆవేదన పత్రము నకు జతపరచి పంప ప్రార్థన.

పైన తెల్పిన నియమముల ననుసరించి సభ పరీక్షా కార్యక్రమం విజయవంతము చేయుటలో సహకరించ వలసినదిగా ప్రచారకులకు మనవి.

హైదరాబాదు-4
ది. 29-5-84

తం॥ వెం॥ సుబ్రహ్మణ్యశాస్త్రి
కార్య. కార్యదర్శి

---

1. ప్రవేశిక నుండి ప్రవీణ వరకు గల పరీక్షల ఆవేదన పత్రములు, పరీక్షా శుల్కము నేరుగా 'శ్రీ పరీక్షా కార్యదర్శి, దక్షిణ భారత హిందీ ప్రచార సభ, టి.నగర్, మద్రాసు-600 017'కు పంపవలెను.

2. సం॥ 1984 ఆగష్టు పరీక్షా కార్యక్రమము :

| | ఉన్నత పరీక్షలు | ప్రారంభిక పరీక్షలు |
|---|---|---|
| ఆవేదన పత్రములు స్వీకరించు ఆఖరు తేది | 5-6-84 | 15-6-84 |
| విలంబ శుల్కముతో స్వీకరించు ఆఖరు తేది | 15-6-84 | 25-6-84 |
| పరీక్షలు జరుగు తేదీలు | 11, 12-8-84 | 12-8-84 |

**3. పరీక్షా రుసుముల వివరములు :**

| | పరీక్షా రుసుము | మార్కుల కార్డు | విలంబ శుల్కము |
|---|---|---|---|
| 1. ప్రాథమిక | రు. 5-00 | రు. 1-00 | రు. 1-00 |
| 2. మధ్యమ | రు 10-00 | రు. 1-00 | రు. 1-00 |
| 3. రాష్ట్రభాష | రు 12-00 | రు. 1-00 | రు. 1-00 |
| 4. ప్రవేశిక | రు. 20-00 | రు. 2-00 | రు. 2-00 |
| 5. రా. భా. విశారద- పూర్వ భాగం | రు. 20-00 | రు. 2-00 | రు. 2-00 |
| 6. " ఉత్తర భాగం | రు. 20-00 | రు. 2-00 | రు. 2-00 |
| 7. రా. భా. ప్రవీణ- పూర్వభాగం | రు. 25-00 | రు. 2-00 | రు. 2-00 |
| 8. " ప్రవీణ- ఉత్తర భాగం | రు. 25-00 | రు. 2-00 | రు. 2-00 |
| రా. భా. ప్రవీణ- (మౌఖిక్) | రు. 8-00 | రు. 2-00 | రు. 2-00 |

హైదరాబాదు - 4
ది. 29-5-1984

తం॥ వెం॥ సుబ్రహ్మణ్యశాస్త్రి
కార్య. కార్యదర్శి

(స్వర్ణోత్సవ సమితి పక్షాన సన్మానింపబడుచున్న హిందీ పండితులు)



పేరు : యమ్. రఘుపతి

వృత్తి : హిందీ పండితులు

కేంద్రము : రామచంద్రపురం; హైదరాబాద్-500032

అభిరుచి : హిందీప్రచారం, విద్యార్థులందు రాష్ట్రీయ భావంపెంపొందించుట.

యోగ్యతలు : ఎమ్. ఎ; ఎమ్. ఒ. యల్; బి. యడ్; సాహిత్యరత్న;

చిరునామా : యమ్. రఘుపతి గుప్త; హిందీ విభాగం; బి. హెచ్.ఇ.యల్.
హైయర్ సెకండరీ స్కూలు రామచంద్రపురం;
హైదరాబాద్-500 032 A. P.



పేరు : కై పా జగదీశ్వరశర్మ

వృత్తి : హిందీ పండిట్

కేంద్రం : కడప

అర్హతలు : బి.యస్.సి, రా. భా. ప్రవీణ, శిక్షక్ ప్రశిక్షణ్.

అభిరుచులు : సమాజసేవ, కవితలు వ్రాయుట, హిందీ ప్రచారం.
పరిచయ పరీక్షయందు ప్రత్యేకకృషి

చిరునామా . కె. జగదీశ్వరశర్మ, హిం. పం., 7/217,
మోచంపేట, కడప-516 001



పేరు : కంకణాల ప్రభాకరరావు

వృత్తి : గ్రేడ్ II హిందీ పండితులు

కేంద్రం : తెనాలి

అభిరుచి : హిందీ ప్రచారం, సమాజసేవ, నాటకాభినయం, పరిచయ పరీక్ష
నందు ప్రత్యేక కృషి

చిరునామా : కె. ప్రభాకరరావు, హిం. పం. C/o బాపూజీ హిందీ విద్యా
లయం, టంకణ విద్యాలయం, షరాప్ బజార్. తెనాలి522 201
గుంటూరు జిల్లా



పేరు : శ్రీమతి మెట్టా సీతామహాలక్ష్మి

వృత్తి : హిందీ పండిట్

కేంద్రం : తణుకు

అర్హతలు : రా. భా. విశారద. విద్వాన్, శిక్షక్, మెట్రిక్

అభిరుచి : హిందీ ప్రచారం. పరిచయ పరీక్షనందు ప్రత్యేక కృషి

చిరునామా : మెట్టా సీతామహాలక్ష్మి, హిం. పం. C/o హిందీ విద్యాలయం
తణుకు_534 211 ప గో. జిల్లా



పేరు : రావిపాటి సుబ్బారావు

వృత్తి : హిందీ పండిట్

కేంద్రం : నరసరావుపేట

అర్హతలు : ప్రవీణ, ప్రచారక్, ఎమ్.ఎ. (హిందీ)

అభిరుచులు : సంగీతసాధన. హిందీ, తెలుగు, భజనలు, హార్మోనియం వాయించటం

చిరునామా : రావిపాటి సుబ్బారావు, హిం. పం. Rtd. 12-5-28
ప్రకాశనగర్, నరసరావుపేట-522 602



పేరు : యస్. యమ్. సుభానీ

వృత్తి : హిందీ పండిట్

కేంద్రం : సాతులూరు

అర్హతలు : ఎమ్. ఎ. (రాజనీతి) బియిడి, సా. రత్న

అభిరుచులు : హిందీప్రచారం, పరిచయ పరీక్షయందు ప్రత్యేకకృషి

చిరునామా : యస్. యమ్. సుభానీ, హిం. పం., జి. ప. హైస్కూలు,
సాతులూరు పోష్టు. గుంటూరు జిల్లా



పేరు : శతపతి గౌరీ కుమారి

కేంద్రం : శర్మద హిందీ విద్యాలయం, మాడుగుల

వృత్తి : హిందీపండిట్

అర్హతలు : సాహిత్య విశారద, SSC, ప్రచారక్

అభిరుచులు : హిందీప్రచారం, పరిచయ పరీక్షయందు ప్రత్యేకకృషి

చిరునామా : శతపతి గౌరీ కుమారి, హిం. ప. శర్మద హిందీ విద్యాలయం,
మాడుగుల-531 027 విశాఖ జిల్లా



పేరు : ఎనిగళ్ళ వాణీ ప్రసూనాంబా

వృత్తి : గ్రేడ్ I హిందీ పండిట్

కేంద్రం : కోసూరు

అర్హతలు : రా. భా. ప్రవీణ, ప్రచారక్, సాహిత్యరత్న

అభిరుచి : హిందీప్రచారం, పరిచయపరీక్షయందు కృషి

చిరునామా : ఎనిగళ్ళ వాణీ ప్రసూనాంబా, హిం. పం ; జి. ప. హైస్కూలు,
కోసూరు-521 152 మొవ్వ తాలూకా; కృష్ణాజిల్లా



పేరు : యరగొండ సిద్ధారెడ్డి

కేంద్రం : కోన, చిత్తూరుజిల్లా

అర్హతలు : విద్వాన్, శిక్షణ పారంగత్, ఎమ్. ఏ. (హిందీ) ఎమ్. ఎ. (తెలుగు) సాహిత్యరత్న, తెలుగు విశారద డిప్లమో.

వృత్తి : గ్రేడ్ I హిందీపండిట్

కార్యక్షేత్రం : జిల్లాపరిషత్ హైస్కూలు, కోనా

అభిరుచి : సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమములలో పాల్గొనటము, హిందీ ప్రచారము మరియు ప్రజాసేవ చేయుటయందు అభిరుచికలదు.

చిరునామా : కోనా 517218; వాయల్పాడు తాలూకా; చిత్తూరుజిల్లా



పేరు : తిమిరిశ వెంకట కృష్ణకుమారి

వృత్తి : హిందీ పండిట్

కేంద్రం : నరసరావుపేట

అర్హతలు : S S.C. ప్రవీణ, ప్రచారక్, సా. రత్న.

అభిరుచి : హిందీ ప్రచారం; హిందీ పరిచయ పరీక్షయందు ప్రత్యేకకృషి

చిరునామా : శ్రీ టి. వి. కృష్ణకుమారి, హిం. పం. C/o యన్. కె. ఆర్. హైస్కూలు, ప్రకాశ్‌నగర్ నరసరావుపేట - 522 601 గుంటూరు జిల్లా



పేరు : కోట్రు రామ సుబ్రహ్మణ్యం

కేంద్రం : లంకల పాలెం

అర్హతలు : సా. రత్న, SSLC ప్రచారక్

వృత్తి : హిందీ పండిట్

అభిరుచి : హిందీ ప్రచారం, పరిచయ పరీక్షయందు కృషి

చిరునామా : కోట్రు రామసుబ్రహ్మణ్యం, హిం. పం. జి. ప. హైస్కూలు, లంకలపాలెం 531 021 విశాఖ జిల్లా



పేరు : విద్యాభాస్కర :- పతి పార్థసారథి శర్మ (కాశ్యప)

వృత్తి : హిందీ ప్రచారం

కేంద్రం : శర్మద హిందీ విద్యాలయం, మాడుగుల

అభిరుచి : పరిచయ పరీక్షయందు ప్రత్యేకకృషి, తెలుగు, హిందీలలో గద్య పద్య రచనలు, అనువాదములు

చిరునామా : విద్యాభాస్కర :- పతిపార్థసారథి శర్మ (కాశ్యప), శర్మద హిందీ విద్యాలయం, హంససదన్. మాడుగుల - 531 027 విశాఖ జిల్లా



పేరు : నండూరు శేషసింగర అప్పలాచార్యులు

యోగ్యత : హిందీప్రచారక్

జన్మస్థానము : పుట్టగుంట

కార్యక్షేత్రము : గుడివాడ

అభిరుచి : హిందీప్రచారం చేయుట.

స్వర్ణోత్సవ పరిచయ పరీక్షకు విద్యార్థులను తయారుచేయుట.



పేరు : వీర్ల లింగమ్మ

వృత్తి : హిందీ పండిట్

అర్హతలు : ప్రవీణ; ప్రచారక్, సాహిత్యరత్న, మెట్రిక్

అభిరుచి : హిందీపరిచయ పరీక్షయందు ప్రత్యేకకృషి. హిందీప్రచారం

కేంద్రం : గుడివాడ

చిరునామా : వీర్లశ్రీరంగమ్మ, హిం. పం. ఓల్డుటౌను, గుడివాడపోష్టు.

జిల్లా.



పేరు : ఎ. బి. ఉమాశంకర్

జన్మతిథి : 1. 7. 1941

యోగ్యత : రాష్ట్రభాషాప్రవీణ శిక్షణకళా పారంగత్ (ఆగ్రా)

వృత్తి : ప్రథమశ్రేణీ హిందీ పండితుడు

కార్యక్షేత్రము : గవర్నమెంట్ జూనియర్ కాలేజ్, పామిడి.

అభిరుచి : హిందీప్రచారంచేయుట. మాతృభాషతో, పాటు మరాఠి మరియు కన్నడభాషలయందు పరిచయం కలిగియుండుట, సంగీతము నాటకములందు విశేష అభిరుచి.

చిరునామా : గ్రేడ్ I హిందీపండితులు. గవర్నమెంట్ జూనియర్ కాలేజ్ పామిడి. గుత్తి తాలూకా, అనంతపురం జిల్లా



పేరు : నందివాడ ముక్తేశ్వరరావు

వృత్తి : హిందీ పండిట్

కేంద్రం : టౌను హైస్కూలు, గుడివాడ

అభిరుచి : హిందీ ప్రచారం

చిరునామా : నందివాడ ముక్తేశ్వరరావు, హిం. పం; టౌను హైస్కూలు,
గుడివాడ పోష్టు, కృష్ణాజిల్లా



పేరు : మద్దూరి సీతాదేవి

వృత్తి : గ్రేడ్ I హిం. పం

అర్హతలు : రా. భా. ప్రవీణ, ప్రచారక్, మెట్రిక్

కేంద్రం : ఆర్. సి. యమ్. స్కూలు, గుడివాడ.

అభిరుచి : హిందీప్రచారం మరియు పరిచయ పరీక్షయందు కృషి

చిరునామా : మద్దూరి సీతాదేవి, హిం. పం. ఆర్. సి. యమ్. స్కూలు.
గుడివాడ పోష్టు, కృష్ణాజిల్లా.



పేరు : గుంటూరి నిర్మల

వృత్తి : గ్రేడ్ II. హిందీ పండిట్

యోగ్యతలు : రా. భా. ప్రవీణ, ప్రచారక్, ఎమ్. ఎ.

కార్యక్షేత్రం : పట్టాభిపురం హైస్కూలు

అభిరుచి : హిందీప్రచారం

చిరునామా : గుంటూరి నిర్మల, హిం. పం. పట్టాభిపురం హైస్కూలు,
పాతపట్టాభిపురం; గుంటూరు-522 006



పేరు : తిపిర్నేని లక్ష్మీనారాయణ

వృత్తి : హిందీ ప్రచారక్

అర్హతలు : తెలుగు మరియు హిందీ భాషలందు పరిజ్ఞానం

కేంద్రం : పడమట

అభిరుచి : రాజనీతి

రచనలు : మానవుడే కర్త, జీవన పత్థర్, సఫల జీవన్ మొ॥నవి

చిరునామ : తిపిర్నేని లక్ష్మీనారాయణ హిం. పం., రామకృష్ణా హిందీ విద్యాలయం, పడమట విజయవాడ-6 కృష్ణాజిల్లా.



పేరు : పతి వేణుగోపాలశర్మ

కేంద్రం . యలమంచిలి,

అర్హతలు : ప్రవీణ, ప్రచారక్ మరియు సాహిత్యరత్న

వృత్తి : మరియు కార్యక్షేత్రం : ప్రిన్సిపాల్, వాగీశ్వరీ హిందీ విద్యానికేతన్ యలమంచిలి

అభిరుచి : హిందీ, తెలుగులో కవితలు, కథలు, నాటకములు, కావ్యములు వ్రాయుట

చిరునామా : ప్రిన్సిపాల్, వాగీశ్వరీ హిందీవిద్యానికేతన్, యలమంచిలి పో. విశాఖ జిల్లా.



పేరు : పిన్నింటి అప్పలస్వామి

కేంద్రం : బొబ్బిలి

వృత్తి : గ్రేడ్ & సెలక్షన్ గ్రేడ్ హిందీపండితులుగా రిటైర్మెంట్ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత.

అభిరుచులు : సాహితీ - సాంస్కృతిక సేవాకార్యక్రమాల్లో పాల్గొనడం జర్నలిజం, హిందీప్రచారం, స్థానిక సాహితీ సాంస్కృతిక-(రిజిస్టర్డ్) సంస్థ 'శ్రీకళాభారతి' కార్యదర్శిగా విశేషకృషి.

చిరునామా : కార్యదర్శి, హిందీ ప్రేమీమండలి, బొబ్బిలి, విజయనగరంజిల్లా 532 558



పేరు : బోయపాటి ఉషారాణి

వృత్తి గ్రేడ్ 1 హిందీ పండిట్

కార్యక్షేత్రం : పి యస్ అప్పర ప్రైమరీ స్కూలు, పుంగనూరు

అర్హతలు : రా. భా. ప్రవీణ, సీనియర్ హిందీ పండిట్ ట్రైనింగ్, ఇంటర్ మీడియట్

అభిరుచి : హిందీప్రచారము, సామాజికసేవ, సాంస్కృతిక కార్యక్రమములందు పాల్గొనుట పరిచయ్ పరీక్షయందు ప్రత్యేక కృషి.

చిరునామా : బి. ఉషారాణి, హిం. పం. 19-120; డి-1 శ్రీరామ పాపన్న నాయుడు వీథి, మదనపల్లి-517 325, చిత్తూరుజిల్లా



# స్వర్ణజయంతి పరిచయ పరీక్ష

## నాల్గవ పర్యాయం జరగనున్న పరీక్షా వివరం

1. పరీక్షార్థుల పట్టిక, పరీక్షా రుసుము
అంగీకరించు చివరితేదీ-ది. 22-6-1984

2 పరిచయ పరీక్ష జరుగు తేదీ ది. 22-7-1984

పరీక్షారుసుం శ్రీ కార్యదర్శి, స్వర్ణోత్సవసమితి, దక్షిణభారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర అని వ్రాసి పంపకోరుచున్నాము.

ది 22-4-1984 జరిగిన స్వర్ణోత్సవ హిందీ పరిచయ పరీక్షార్థుల ప్రమాణ పత్రములు 84జూన్ నెలాఖరకల్లా ఆయా ప్రచారకులకు అందునట్లుగ వలయు ఏర్పాట్లు చేయబడుచున్నవి.

గోదా తిరుమలయ్య
తాత్కాలిక కార్యదర్శి
స్వర్ణోత్సవ సమితి

హైదరాబాద్
25-5-84



ది. 7-5-84 తేదీన శ్రీ వి. ఆర్. చంద్రశేఖర్ ప్రధాన కార్యదర్శి, ద. భా. హిందీప్రచారసభ ఆంధ్ర తెనాలి హిందీప్రచారక విద్యాలయం సత్రాంత సమారోహంలో ఉపన్యసించుచున్నారు.

Edited, Printed and Published by V. Radhakrishna Murty, on behalf of the D. B. Hindi Prachar Sabha-Andhra, 959, Khairatabad, Hyderabad-500 004.
and Printed at Dakshina Bharat Press, Hyderabad-500 004.